ఓం

సరస్వత్యై నమః

# బుద్ధ భగవానుని చరిత్ర

బుద్ధఘోషుని పద్య చూడామణికి

అశ్వఘోషుని బుద్ధచరితకును అనువాదము





చర్ల గణపతిశాస్త్రి

# విషయసూచిక

అమరుడైన కుమారుడు
బుద్ధనారాయణశాస్త్రికి
కుమారునిజూచి అమరురాలైన పత్ని
సుశీలకును



గ్రంథకర్త

చర్ల గణపతి శాస్త్రి

# బుద్ధభగవానుని చరిత్ర

## మొదటి యాశ్వాసము

*ఎవ్వనిదృష్టివీచి ప్రసరింప దయాసుధ పొంగిపొర్లునో
ఎవ్వని ధైర్య మాస్మరు విజృంభణవహ్నికిఁ గాల మేఘమో
ఎవ్వనిబుద్ధి మోక్ష సురవృక్ష నవోదయ మూలకందమో
అవ్వనజాప్తబంధుని మహా మహిమాంకుడు, బుద్ధు, ప్రమోక్త్రదన్॥

సరసిజాసనుఁడాదియౌ జ్ఞానులేని
ఎవనిమహిమ స్వల్పమును వచింపలేరొ
అట్టి ధర్మశాసన బుద్ధు ననఘు చరిత
తగ నుడువఁబూను టొనుట మౌగ్ధ్యంబుగాదె॥

అయినన్ బూజ్యుఁడు బుద్ధుమీఁది యమలంబౌ భక్తితోఁ దచ్చరి
త్ర, యమోఘంబుగఁ జెప్పఁగల్గుదు మహా ప్రావీణ్య మొప్పార, నెం
తయుఁ దత్పాదము లాశ్రయింపుటను హీనంబైన దుర్మేధ, ల
క్ష్మియుఁ గూర్పంగదె సర్వలోకముల కక్షీణంబైన భాగ్యంబుతో॥

కపిల వస్తువని ప్రశస్తి గన్నపురము
కలదొకండు. ప్రజలకది కల్పతరువు
దానిఁగనుఁగొని తన రాజధానియెడల
శ్లాఘవిడిచె దేవేంద్రుఁడు స్వర్గవిభుఁడు॥

### కపిలవస్తుపురవర్ణనము

సతతం బా పురిలోని సౌధములపై జండాల స్తంభంబులన్
ప్రతిబింబించిన చంద్రుఁడొప్పె, వనితల్ స్వాస్యద్యుతుల్ దొంగిలన్

---

* ఈ వర్ణన మంతయు బుద్ధ ఘోషునిది.

మతిఁ గోపంబునఁ జంద్రుఁ గొబ్బడఁచి హర్మ్యాలందు ప్రేలాడఁదీ
సి, "తగన్ వర్తిలకున్న నిట్టిగతియే చేకూరు" నన్నట్లుగన్ 5.

మణులు దాపిన వీథులం బ్రతిఫలించి
యచట నక్షత్రములు మించి యలరుచుండె
ఎక్కుడు స్వాదు* చెఱకు పంటినెడలి క్రిందఁ
రాలిపడెడు ముత్యాల సరాలువోలె॥ 6.

అందు ధనికుల యెత్తైన మందిరములు
పైకి విసరిన జైత్రంపు ధ్వజపుఁగల్ల
లనెడి బాహుల నర్థుల కర్థమీయఁ
గదలు గంటలధ్వానిఁ బిల్చు కరణినొప్పు॥ 7

అచట రత్నాలు దాపగనయమరుదార్లఁ
ప్రతిఫలించు నేనుంగుల శోభలు దనరెప్ప
కులగిరులు నాదిశేషుని కెలమి సాయ
మొనరుపం గ్రిందికిన్ వచ్చి యున్నయటులు॥ 8.

అందు గృహ పంజరంబు నందములుకఁ
బోలుపు బంగారుతోఁ దీర్చు బొమ్మలెసఁగె
నిల్చి శత్రుపురంబుల గెల్చి తెచ్చి
బార్లు దీర్చిన నగర దేవతలు వోలె॥ 9

అందు ప్రోషిత భర్తృక లంబుదముల
దారి దాటిపైనున్న హర్మ్యములనెక్కి
వర్షముల నంధకారమౌ పగలుఁగూడ
మబ్బుల యుబుకు మాటైన మసలి వినరు॥ 10

బహుసువర్ణధ్వజ స్తంభ పంక్తిచేతఁ
బైకిడిన యెత్తుగు కరాలపంక్తిఁబోలె
నచటి యిండ్లీర్ష్య నింద్రు గృహాలశోభ
లపహరించిన యువివోలె నలరుచుండె॥ 11

---

* చెఱకు కణ్ణలో ముత్యములు పుట్టునందురు.

౨. అ. కపిలవస్తు పురవర్ణనము

తమదు మేడల దరిఁజేరి తనరు నర్ధ
చంద్రకళను నంగనలు హస్తాలలాగి
అందుఁ దమముంగురుల ముడిచి యలరుచుంద్రు
స్వచ్ఛ శశికళఁదాల్చు పార్వతులు వోలె॥

అందుఁగల మండపము లెండలందు మాడి
చెదరు జండాల నాల్కల చివరచేత
అమృత రసములఁ జిలికించి యమరుబింబ
మొప్పు నమృతాంశు నాకుచున్నట్టులొప్పు॥

అందు బౌద్ధ విహారములందు వెలయు
సింహముల బొమ్మలను జూచి చెదరి యెడకో
మృగముపాఱఁ, గళంకములేని చంద్రుఁ
డబ్జవదనల మోము సామ్యమును పొందు॥

ఇంపులు దనరు కొత్త నలంకరించుకొనెడి
సతుల కాయ్యారులకుఁ జంద్రశాలలందు
రాత్రివేళల నెదురఁ బరంగి యుండు
నఖిల కళ చంద్రబింబమె యద్దమగును॥

అందు ఇంద్రనీల మణుల నమరు గోపు
రములయందు విజృంభించు రశ్మితతులు
పూర్ణచంద్రుఁ డఖిలకళా పూర్ణుఁడయ్యుఁ
గడకురాఁగఁ గళంకశంకలను గూర్చు॥

తటములఁగల క్రీడా పర్వతములు స్వచ్ఛ
జలములన్ సంక్రమింపఁగ వెలయు నదులు
ప్రకట మదలంపమునను సైరావతంబు
మునుఁగు సురగంగ పోలికఁ బొల్పునచట॥

రంగురంగుల రత్నాల రచితమైన
గేహములు లోఁ గ్రిందఁ బయివెల్గు కిరణపంక్తి
నందు వర్షకాలము నంతమైనఁగాని
యింద్రధనుసుల మిన్నట్టు లింపునింపు॥

మేలి బంగారు మేడల జాలులందు
లలితలీలల విహరించు లలన లచట
ఆసుమేరు శృంగాల విహారములకు
నోచుకొను నచ్చరల ద్యుతుల్ దోచుకొంద్రు॥ 19

అందు స్ఫటికాలుదాపిన యాలయముల
నటు విజృంభించినద్యుతుల యంకురములు
పార్శ్వములనున్న పచ్చని వారువముల
చెవులకొక త్రుటి చామరశ్రీల నింపు॥ 20

మరియు నా పురిలో నిటునటు ప్రసరించు గరుడపచ్చల తోరణంబుల కిరణంబులు ప్రవాహంబులఁ గలియ నొప్పు నాకాశగంగ యమునానదితోఁ గలిసిన లోపలిభాగంబుగలదివోలె నొప్పుచుండె. సౌధతలంబులందుఁ నెత్తుగాఁగట్టిన మత్స్య ధ్వజంబులు గాలికల్లాడుచుండ నాకాశగంగలోని, మొసళ్లు వానినిజూచి శత్రువు లనుతలంపుతో వానితో నా
పురమున వివాదపడుచుండును॥ 21

ఆకసమంటు మేడల విహారముసల్పు నొయ్యార్లమేనిపై
నేకతమై జనించి ప్రసవియించెడి చెమ్మట పోనపోవ, మం
దాకిని వీచులన్ బలువిధాల శీకారులు చేయు వాయువుల్
మేకొని మెల్లమెల్లఁ బ్రసరించుచు నా పురిపోయి గూర్చెడిన్॥ 22

అందుఁజంద్రుడు రేల స్వచ్ఛమౌ సుధతోడ
వెనుకేళి గృహముల వెల్లవేయు
అట నింద్రనీలాల చదుగుల శశికళఁ
గని హంసలు మృణాలమనుచుఁ గొఱకు
అటనిండ్లఁ బొగక్రమ్మ ననమయరాహుఁగా
తలఁచి రవి * ఘనాటవులను దాగు
అట స్ఫటికతలాల నరసి ముఖచ్ఛవు
లమర గంగాబ్జాల యటుల వెలయు

* ఘన=గొప్ప, మేఘములనెడి

అందుఁ జక్రవాళము మించినట్టి ప్రహరి
దాటిపోలేక సూర్యుండు దక్షిణాయ
నోత్తరాయణ మిషపెట్టి యొదిగి యొదిగి
దాని ప్రక్క భూముల దరి దరినె తిరుగు॥ 23

ఆ పురిలోని యగడ్తల తరంగంబులు వాయుక్షోభలచేఁ బొంగి గట్లు దాటి క్షీరసముద్రమును జయించుటకుం జేయు ప్రయత్నములు మీఱినట్టుల నొప్పాఱుచుండు. అందు నల్లని యగరవత్తుల పొగలు వ్యాపి పమిశ్రము లైన మేడలందలి పట్టు చీనాంబరముల జండాలు-యమునా తరంగంబులచేఁ గొట్టఁబడి స్వర్గంగా తరంగంబులువోలె విరాజిల్లుచుండు. అట్టి పురవరంబున మాన్యుండు ఇక్ష్వాకుల వంశ్యుఁడు రాజ్యాధిపతియు రాజ్యలక్ష్మీ విరాజితుఁడు ధర్మప్రకారముగ నీప్సితార్థంబులు సంపాదించువాఁడునగు పద్మోదయుండను సార్థకనాముఁడగు రాజుండెను. ఆతఁడు శరచ్చంద్రునివలె ప్రజలకు ప్రియుండయి యుండెను. 24

ప్రభువతఁడు ప్రతాపాగ్నిన్ వివాహమందు
సాక్షిగానుంచి యసిధార జలముతోడ
శత్రు రాజ్యలక్ష్మిని. నెల్ల క్ష్మాధిపతులు
గనుచుండఁగఁ బెండ్లాడె ఘనముగాఁగ॥ 25

వఱకఁబడిపడి రక్తముల్ వఱఁదవాఱు
మదగజేంద్రాల బహుళ కుంభములచేత
వేసి యభిషేక, మతఁడరిచ్ఛిన్న హృదయ
పద్మములఁ జేసె యుద్ధదేవతకుఁ బూజ॥ 26

స్వాతను పులకాంకురంబులు ప్రతిఫలింపఁ
గడు నలంకరించుకొని తత్ఖడ్గధార
వైరులను సత్వరమ పిల్వఁ బంపి వట్టి
యముని యాహ్వానపత్రిక యను దనర్పు॥ 26

అవని 1భృన్మహిమాతిశయంబు లుడివి
నిఖిల వీతారికుల 2వాహినీశ మగుచు
తదసిలత 3భువన ప్రసాదంబు గూర్చె
4 నుదయమును పొంది యా యగస్త్యుండువోలె॥ 28

అతఁడు ధనువుదాలిచి మేఘమటుల వెలసి,
5వాహినిని 6విపక్ష7పృథివీ ధరుల 8కటక
తలిని వెడలఁగఁజేసి, వ్యాకులిత 9రాజ
హంసముగ 10సకబంధ నృత్యము నొనర్చె॥ 29

వైరిభటుల నరాల మాలికల నలంకరించుకొని క్రీడా జలయంత్రములఁబోలు నేనుంగు తొండములు ధరించి యతని వైరిభటుల రక్తంబు పూరముల్తైన నదులందు పిశాచంబులు జలకేళులం దేలుచుండు. శ్రేష్ఠం బయిన యతనికీర్తికాంత, ప్రతాపములనుండి బయలువెడలిన మసిని గ్రహించుటకై ధరించిన యింద్రనీలపు గిన్నెనుబోలిన నీలమేఘశ్యామలమయిన యాకాశము ప్రకాశించు. అతనికీర్తులు బ్రహ్మాండమున నిండి పట్టక యాకసమంతయు వ్యాపింప శత్రురాజుల కీర్తులు కదలుటకుఁగాని అటు నటులు మెదలుటకుఁగాని యవకాశములేనట్టులయ్యె. అమృతబులు వెదజల్లు చంద్రునివలె స్వచ్ఛమైన యతని కీర్తియె త్రైలోక్యవచారములు గలిగింపనిచో సైపరాని యతని ప్రతాపాగ్నిని ఈ లోకమెల్లు సహింపఁగల్గి యుండెడిది సర్పరాజువలె భారము వహించు బాహువుచే దృఢముగ సకల భూవలయంబును ధరించుచుండ శత్రుకాంతల భుజవల్లరులనుండి కంకణవలయంబులు విచిత్రంబుగ జాఱిపడెను మిగుల నుదారుండును దయాళువు నగు నతని నాశ్రయించి యర్థిగణంబులు ఇతరుల దరికెన్నఁడును పోవరు.

---

1 అవనిభృత్=రాజులు, వింధ్యగిరి. 2 వాహినీశ=సేనాధిపతులు, నదీపతి సముద్రము. 3 భువన=లోకము, జలము 4 ఉదయము=అభివృద్ధి, ఉదయించుట 5 వాహిని=సేన, నది, 6 విపక్ష=శత్రులు, ఱెక్కలులేని, 7 పృథివీధర=రాజులు, 8 పర్వతములు. కటకము=రాజధాని చరియ, 9 రాజహంస=శ్రేష్ఠ రాజులుగలది, రాయంచలు గలది, 10 కబంధనృత్యము=మొండెముల నృత్యముగలదిగా, జలతరంగ నృత్యములు గలదిగ॥

జలధరంబు లెన్నఁడైనను సముద్రమునుపొంది ఇతర తటాకమును సమీపింపఁగోరునె అవతంసంబులగు మాల్యంబులనుండి వెడలు మధువుల చాలులు ప్రవహించుటవలన మిగుల శీతలమైన యతని స్నానగృహంబున లక్ష్మి బాహ్య ప్రతాపజ్వరంబున నొడలు తెలియనిదివోలె లౌల్యము నువీడి విహరించుగంగాది పుణ్యతీర్థములనుండి యతని యభిషేక సమయమున సచివులు తెప్పించిపోసిన జలంబులచేత శత్రుప్రతాగ్ని తేజస్సు లోపల హృదయజ్వరముతోపాటు శాంతినొందె. సువర్ణరూపంబులుగలిగి సుమనస్సేవ్యమయి, యున్నతంబయి సుధర్మాలయంబయి యద్వితీయంబయిన యతనిని సంధి విగ్రహ యానాసన ద్వైధీభావ సమాశ్రయంబు లనెడి షడ్గుణరత్నంబులు మేరుగిరినిబోలె బొంది ప్రకాశించినవి. 80

అన్యములఁ బండితుల చెవు లంటుకొనక
తచ్చరిత్ర శ్రవణమునఁ దగులుకొనియె
సురలనాల్క యమృత రసాల్ చూఱగొనక
యన్యరసముల నెపుడేని యందునొక్కొ॥ 31

ఉర్విపతులు వేలకొలంది యుండ్రుగాక
అతనిచే భూమి సౌరాజ్యవతిగనయ్యె
అంబుధి యనేక రత్నాలకాటపట్టై
యయ్యెఁ గౌస్తుభాన నగు రత్నాకరంబు॥ 32

ఆ మహాత్ముఁడౌ రాజు యజ్ఞములకు
నమృతభోజుల నాహ్వానమంపుచుండ
నింకఁ బారిజాతమ్మె దేవేశుఁడింద్రు
రాజధాని కలంకార ప్రాయమయ్యె॥ 33

అతని చరితలు తీరంబులందు మసలు
దేవతాస్త్రీలు గానాల దిశలునింప
విని ముదమున మేరుగిరి ద్రవించిపోలె
నేఁటికిని సెలయేరులై నిండిపాఱు॥ 34

క్షోణిపతి దానవర్షాలఁ గురియుచుండ
ఎవఁడు సంపూర్ణకాముఁడై యెసఁగఁడెట్లు

మింటి గొండంత మబ్బాక్రమించి, కండ
పోతగఁ గురియ సరసులు పొర్లి పోలె॥ 35

జలధికి నదివోలె రవికి నళినివోలె
శశికిఁ గళవోలె హరికి పద్మాలయవలె
జలధరునకు మెఱుపుఁ దీవెవలెను జతికి నటనికి
మాయవోలె మాయాదేవి మహిషి దనరు॥

మఱియు నామె యింద్రుని బోలిన యతనికి శచీదేవివంటి రాణియై యుండెను. ఆమెదీప్తి రాజుశక్తితో సమానమయినది. ఆమె లక్ష్మివలె సుందరియై భూమాతవలె ధీరురాలై యుండెను. 37

తలిరుఁ జివురుల పొట్టల తమ్ములైన
సొలఁతి చరణాల తామరపూలజంట
క్షోణి సామంత సతుల ముంగురుల లతల
కలరులయి గోళ్ళనెఱ చందురుల ధరించె॥ 38

జగతిలోన నత్యద్భుత సన్నివేశ
మెసఁగి సౌకుమార్యము సంతరించుకొన్న
యాసతితొడల యటువంటి యందములకు
నెక్కుడయును సాటియును వీక్షింపమెఱను. 39

నిండుగఁగనందగు గజేంద్రు తొండములును
పుడమి మేలిజాతియనంటి బొందలేని
ఆమె తొడల విజృంభించి యందగింపు
మహిత జలధికి బిందువుల్ మాత్రమగును. 40

మణుల మొలనూలి వలయంబు మలచి చుట్టఁ
బడునడుముగల్గునారాజు పట్టమహిషి
జలధి రత్న గర్భతటుల్ గౌగిలిని గ్రుచ్చు
నిసుక తిన్నెల వన్నెల నెసక మెసగు 41

సుధల సంద్రంపు సుడివోలె సొంపునింపి
వంగు కనుబొమ్మ గలయామె హంగునాభి

౧ ఆశ్వా॰ మాయాదేవి వర్ణన

బొమ్మ కొండల ద్యుతుల ద్రవమ్ము పేర్లు
టుటలన్ గొయ్యెయగుచోటు వగిది నలరు 42

మదన బీజాలు చల్లిన సుదతిమేని
పొలములో నందచందాల జలముపాఱ
జవ్వనపు హాలికుఁడు మూఁడు దాళ్లుతీర్చు
కాల్వవలె నా మెత్రివళులకడుపు నడరు. 43

మూఁడు వళులంటుకొను వువుఁచోఁడినడుము
నెల్లదారిద్ర్యముల పుట్టి నిల్లు సుమ్ము
స్వర్గ గంగా జలపుమూఁడుపాయలొప్పు
నాకసముటు సుమధ్యా మధ్యా దనరు 44

ద్రుమ తమాల నీలపు నూత్నరోమరాజి
ఆ సరోజేక్షణకును నొయ్యారమిచ్చు
బాల్యదశకు వినాశంబు స్పష్టపఱచు
నూతనోత్పాతముల ధూమకేతువటులు. 45

కోమలాంగి హృదిని కోదండనైపుణి
నభ్యసించెడి కుసుమాస్త్రనారి
ప్రతిఫలించి సరిగఁబయికిఁగ నుపడుపటుల
సుదతి రోమరేఖ పొదలి మెదలె 46

వేల లంఘించి కడు విజృంభించుచున్న
యాతరుణి స్తన మండల పాళిచేత
నడుమ తక్కుతక్కుగల ప్రాంతములలో.ి
యెల్ల లాకసంబును నాక్రమింపఁబడియె 47

నవవిలాస దీర్ఘికలో మృణాలిమాల
మేలి యౌవన ఘనపంక్తి మెఱపుఁదీవ
మకరకేతుని మాంగళ్య మాలికాళి
ప్రథిత వామలోచన రమ్యబాహులతిక 48

ఆమె మెడనుదాలిచిన ముత్యాలసరము
మిగుల దర్శనీయత మిఱుమిట్లు గొలుపు
ముత్తియములఁ జిమ్మెడి శంఖమున వెలంగు
నంబునిధి మనోహర తరంగంబువోలె. 49

సవతు లేనట్టులామె యాస్యామృతాంశుఁ
బలుపఁగోరి ప్రజాపతి సరసిజమును
ధ్రువము* యాత్తగంధముగఁ జందురునిబింబ
మంతరమునఁ గళంకమున్నటులఁ జేసె 50

చెట్టుల ప్రవాళము, చలమస్థిరమునౌట
వారినిధి ప్రవాళము స్థిరముఁ బరుషమౌట
అంబుజేక్షణ బింబాధరంబుతోడి
యెల్ల పోటీలనుపసంహరించుకొనియె. 51

నవవిలాసలు విఱునవ్వులలమికలియ
నాయతాక్షి బింబోష్ఠంపుటందమలరు
ఎఱ్ఱమంతెనపుడు కాంతులెసఁగు పూర్ణ
చంద్రికల చిత్రమిశ్రిత సంధ్యవోలె. 52

చెలువములను నత్యంతము చిందు నుదుటి
చందురుని రేకఁజాల్వాఱు నందములకు
నెదొ ప్రణాళియై క్రీఁగంటి నదులహద్దు
నగుమఁగొత్తజవ్వనిముకస్ర్యయారెః మీఱు. 53

కస్తురి సుగంధ పత్త్రరేఖలనుదిద్దు
నామె చెక్కిలి శశిబింబ మందమొంది
ముబ్బుగాలుల మలినమౌ మధ్యగలుగు
నద్దపుంజెల్వు లంఘించి యణఁచివైచు. 54

ఆమెకనునల్లఁగల్వకన్నంబులందు
జరగునల్ల కల్వకు విశేషంబుచాల;

---

* ఆత్తగంధము = తిరస్కరింపబడిన గంధముగలది, పొందబడిన గంధముగలదియును.

మొదటిది సుమశరు నమోఘపుంగటారు
రెండవది యార్ద్రగని మాఘ నెండియడగు 55

చల విలాసలఁ జిమ్ము విశాలమైన
యామెకంటి చేత నపజయంబుపొంది
యిప్పటికిని లేడిపిల్లలు సిగ్గిలివాలె
వనులఁ గందరంబుల వాసమును బొనర్పు 56

రమ్య సౌభాగ్య వార్ధితరంగమైన
సకల తారుణ్య కల్పద్రుశాఖలైన
కన్బొమల తీవియలచేత కాంతమోము
తుమ్మెదల బార్లుగల పద్మతుల్యమయ్యె. 57

గుచ్ఛమగు ముంగురులచేత గొమరుమీఱు
నా సరసిజాక్షి నుదుటి విలాసరేఖ
అక్షరపు బింబపంక్తుల నందమైన
యతను జైత్రధ్వజపుఁ బట్టికటులవెలఁగె. 58

లోల లోచన ద్వాయి చేతశోభనీయ
మైన యామెముఖము జలమందుఁదిరుగు
మీనముల జంటచే నందమీసుమన్న
మురువు తామరపువ్వును బోలియలరు. 59

కమ్ర గోరోచనా గౌర కాంతులొప్పి
తుమ్మెదల వలె నీలికేశమ్ములలరు
నామె,పొగలుపై కేగుధూమాగ్రభాగ
యయిన మంగళ దీపికయటుల తోఁచు 60

అట్టి సర్వలక్షణ శోభిత యయిన యా మాయాదేవి యుత్తరులకు లభింపరానిభర్తృసుఖప్రదమైన యర్ధాసనమందుఁ గూర్చుండి పతిసెలవు రాజ్య కార్యంబులు చూచుచుండు. లక్ష్మిగాక మధుసూదనుని వక్షస్థలమునధిరోహించుటకు ఎవ్వరు అర్హులవుదురు ఆశుద్ధోదనుండు పట్టపురాణి మాయాదేవితోఁ గూడి కుబేరుండు వోలె పరమైశ్వర్యములననుభవించుచుండెను కాని

మాన్యగుణములచే సుజ్ఞానులరాలైనయాపట్టమహిషి యందు వంశవర్ధనుఁడైన తనయుని పొందఁగోరి యాశుద్ధోదనుఁడు ప్రదీపధూప ప్రముఖములైన పదార్థములు వెలుఁగుచుండి దేవతలనారాధించుఁడె. 61

మునిఁగెన్ దీర్థములందు. మంత్రపఠనముల్ మున్మోలుపారాయణం
బొనరించెన్ సతమిచ్చెదానము, తపంబుల్ చేసె, ధర్మంబులన్
వినె,సత్పూరుషులన్ మహాత్ములను సేవించెన్ మహాభక్తితో
ఘన శుద్ధోదన చక్రవర్తి సతిరాఁగాఁబుత్రకా మార్థియై 62

చిరకాలంబిటు పుణ్యమైనవ్రతముల్ సేవించియుఁన్ బుత్రునిన్
ధరణీనాథుఁడు పొందఁడయ్యె, నయినన్ దైవంబుపైనమ్మికన్
విరమింపం, డిటువూనె సిద్ధికొఱకై విశ్రాంతిలేకుండనే
విరమింపంజనఁబోరు ధీరులెవుడున్ శ్రేయాశయమ్మొందకే. 63

ఇది

మొదటి యాఖ్యానము



# బుద్ధ భగవానుని చరిత్ర

## రెండవ యాశ్వాసము

### బుద్ధత్వముపొంద సురగురుని దేవతలు వేడుట

అది యట్లుండనింతలో జగమున అటువంటి యుత్కృష్టమైన బుద్ధావతారరూపమైన యదృష్టనిమిత్తము సంభవించినదని గ్రహించి దేవ గణంబులు పరస్పరము కూడినవారయి సర్వజ్ఞత్వము (బుద్ధత్వము) పొందుటకు నీకిదియవసరము అని సురగురువును తెలుపుటకై తుషిత మను పేరం ప్రసిద్ధమైన దేవతా పట్టణమునకు వెడలిరి.

గరుడపచ్చలయిండ్లం గడుప్రాకి ద్యుతులీన
శాద్వలాభ్రమటు తెసంగునచట
రేలందేల్ మృగళిఖలోల దృష్టులకాంతు
లలమ మేచకతనా ప్రాంతమలరు
తెలంజకోరముల్ నాలుకచేనాక
నటు దంత వలభుల పటలి మెఱయు
అద్దమై ప్రసరించు నా మణితోరణ
ద్యుతి మంగళపు మాలలొప్పునచట ౧
మ్రోగుస్మరుని వలయిత కార్ముకపునారి
మ్రోతం బ్రోషిత పతిక ఉలుకుదురుపురిని
మదపుటేన్గుల చెక్కిళ్ల మదపుటేర్లు
యంబువుల బురదలగును నచటిరోడ్లు. ౨

తిన్నని వేనవేల్ మెఱుపుందీవెలం బోలిన పూవుంబోండ్లం బల్
సున్నని మేనికాంతింబున రుక్తములౌ, నటదీపమాలికల్
ఉన్నత సౌధభాగముల నుచ్ఛ్రితకేతుల మేలివల్వలే
వెన్నగు దిగ్వధూటులకుం జిత్రపు మేలిముసుంగు లయ్యెడన్ ౩

పువులన్ గోయుచు నల్లాడి తిరుగన్ బాఁబోండ్ల పాలిండ్లు కే
ళి వినోదాచల శృంగభాగములువోలెన్ భావనం దోఁచఁగన్
నవకంబౌ సుపుఁదీయమామిడుల యందాలీను క్రొంబూతఁగా
బువలౌ తేనెల సోనలున్ కొలనుపిల్లన్ బొర్లిపాఱున్ బురిన్ 4

నవశృంగారపు మండపాలకొనలన్ దాపింపు రత్నాల క్రొం
జిపురుంగాంతులపుంజ, మింద్రధనుసుల్ వేకూర్చు యందాలిడన్
దివిఁగల్పద్రుమముల్ తమంత దెసలన్ దివ్యంపు సౌభాగ్యముల్
వివిధాంతస్థులఁ బ్రోగుపెట్టి కురియన్ లేదందు దారిద్ర్యమే 5

అటువంటి చిత్రవిచిత్ర రచనా శోభితమగు నా పురమున విరాజిల్లు నొక ప్రాసాదమున వివిధరత్నశిలలు దాపిన సింహాసనమున మెఱుంగు లీను గైరికాదిధాతువులచే, చిత్రవిచిత్ర వర్ణములఁ జిమ్ము మేరుగిరిచఱియల ప్రదేశంబున మృగేంద్రంబువోలె ఆసీనుండయున తుషిత పట్టనాథుడైన దేవునిని సురగణంబులు దర్శించిరి.

## తుషితనాథుని వర్ణన

మణిమౌళి వలభుల మహిత సితచ్ఛత్ర
    రుచులుదయగిరి శృంగ చంద్రుని జయింప
పెదఁగుబఁగరు రేకువెదఁదనుదురుద్యుతుల్
    దిగ్వధూముఖసుధల్ తెగడమంద
మురువుక్రీఁగన్నులు కరుణాబ్ధి విహరించి
    ద్యుపతి లక్ష్మికేళి తోవలఁగూర్చ
అభ్ర గుహలహొమ్ము నానందహసితాలు
    స్వీయశోబ్ధిని పెంచు శశినిచేయ 6

దరిని నుండి సహజభక్తి నెఱవి వెలుగు
స్వాత్మ బింబంబులట్టులు సఖులు వెలయ
కదలు మోవి పగడపు రాగాల వంక
యొసగ ననురాగముల వెల్లడించె నతఁడు. 7

ఆనంద బాష్పాల నక్షలలత పొంద
    బుల కాంకురాళిఁ జెక్కిళులు విరియ

మంగళ పాఠకుల్ మధుర కంఠంబుల
స్వచరిత్రములు పాడి సరిగ వినుప
చెవి కల్ప వృక్షపుఁ జివురుఁదేనెలు సువి
క్రమ బాహుల కభిషేకములు చేయ
చెవికమ్మ స్ఫటికాలు చికిలికెంపులు బాహు
బల-యశ- స్సూర్యచంద్రులుగమెఱయ

అవతరింపఁబోయెడి బుద్ధు రాతు నొనర్పఁ
ప్రబలు దేవదత్తుని ఖడ్గరక్తధారఁ
బోలి మందార పుష్పాలమాల మెడను
బాహువుల మధ్య ప్రేలాడఁబరఁగె నతఁడు 8

రత్న కంకణ ఘృణుల్ ప్రసరించు-భుజముల
బల తేజ మొఱుఁ జివుర్లు కొమ్మలుగఁదాల్పు
ఒడలి గంధపుఁబూత నడుదు కుంకుమ కళల్
* జీమూత వాహన స్థితులు దెలుపు
విశల విజృంభించి దప్పించ మణిఘృణుల్
బోధి పద మహిమల్ బోధపఱచు
పాదాబ్దములు సోకు పద్మరాగ ప్రభల్
కనఁబోవు మునివేష ఘనతఁ దెలుపు 9

బొమ్మనెడి కవాటపు ఫలకమ్మునందు
ప్రతి ఫలించు సౌధవలభి రత్న ప్రతిమ
లక్ష్మి సాక్షాత్తు వక్షస్థలపుఁబవాల్లు
నిలువ నలరారు హరివోలె వెలయునతఁడు. 10

ఆలరుల తేనె చాలుపడ నందముచిందెడి యొజ్జకల్పలన్
జెలువుగఁ గేలఁదాల్చి విలసిల్లు విభుండు, పెకల్చి యాయఁగా
ల్పాలయి చెలంగి నెత్తురులుపాఱఁగ నొజ్జి కల్పలన్ బలెన్
బొలుపగు కన్నులొప్పునిది పోలికఁ జెప్పనుపహించు నెంతయున్ 11

---

* శంఖ చూడుడను నాగునిరక్షించుటకు జీమూతవాహనుడను గంధర్వుఁడు శరీరమును గరుత్మంతుని కాహారముగ నిచ్చినప్పటి పరిస్థితులు.

అలఁదిన మేనిగంధమున కల్లలనాడుచు వ్రాలుతేటి గుం
పులు చనఁబోలు చెంగలువఁ బోల్చెడి యావిభుఁ డొప్పె, నీ జగం
బుల మదిఁ జేయికొంచుఁ గడు ప్రోగులు వాఱిన చిత్తపుందమం
బుల వడిఁ బాఱఁదోలెడినిబో యను నట్టులు చూచువారికిన్

మఱియు నా దేవేశుండు దిఙ్ముఖంబులందుఁ బ్రసరించుచుఁ గొనియాడఁదగిన యచ్చెరువగు తన యవయవంబులఁ దొలికిసలాడు కాంతి పుంజముల యమృత ప్రవాహముల చేతఁ దన ప్రతాపమనెడి సూర్యుని తాపము వలన బాధ పొందు సురరాజలోకంబుఁ దడుపు వాఁడునుబోలె వెలయుచుండె. ఊగులాడు కరకంకణంబులు పరస్పరము తగుల్కొనిధ్వానించు ధ్వనులకు సకల దిశా ముఖమండలులు ప్రతిధ్వనులు చేయుచుండ అమరపురీ వార విలాసినులు వింజామరల గాలులు అయ్యమర విభునకు వేయుచుండిరి. విశాలమైన గగనము నుండి వక్షస్థలమున నిరువైపుల వ్రేలాడుచున్న ముత్యాలసరాలు గల యావిభుండు ఆకాశగంగ యందలి సెలయేళ్లజాలులు కౌఁగిలించుకొన విరాజిల్లు అమరగిరి గర్వంబునుబోఁగొట్టువాఁడునువలె భాసిల్లుచుండెను. అభంగురంబులగు పద్మరాగంబులఁ దామరపువ్వునాకారంబుగలుగునట్లు ధ్వృతంబయిన వానముల చేతఁ దిరస్కరింపఁబడి పాదానతమై వచ్చిన పద్మనిధిబోలిన ప్రకాశంబు గలిగిన పాదపీఠంబునఁ గుడికాలుంచి యతండు ఇటునటు కదపుచుండె. పాదంబులఁ బూసిన లత్తుకరంగు మహరించినవివలె నెఱ్ఱనైయున్న వ్రేళులెత్తి, యావిభుండు నమస్కరించుచున్న దేవతల వదనారవిందంబుల వికాసము కొఱకు లేయెండలను గురిపించువాఁడునుబలెనుండెను. అమృతాంశు కిరణంబుల మొలకలవలె దట్టమైన క్రొత్తకాలివేళ్ల గోళ్లకాంతి పుంజముచేత జాల్వాఱుచున్న యమరనది సెలయేటి మరందధారలచేత రమ్యంబులగు పాదపద్మంబులుగలపద్మనాభునివలెనుండి సంసారంబు నందలి ఘోరపరితాపమును బొందిన జనులను రక్షించుటకై ఇదిసమయమగునా కాదా అను జిజ్ఞాసకలిగి, మాణిక్యంబుల చప్టావై ప్రతిబింబించిన ప్రతిమమిషచే క్షితియందు అవతరించు కోరిక కలవాఁడును బల్పెనుండి వెలయుచుండిన యాజగత్త్రియగురుని తుషితాలయ పారిజాతుని, దర్శించి నేలపయి వంగిన శిరస్సులతో నమస్కరించి, హస్కలకందని పదవితో నలరారిన యా దేవదేవునిని దేవతలు స్తుతివాక్యలతో వర్ణించుచు నిట్లుపలికిరి.

అవధారు! దేవ దేవ! దీనులను జూచినవెంటనె వారిని కనికరింప ముందు ముందుకు విజృంభించి పోయికారుణ్య జలధర ప్రవాహంబులు వెల్లి విరియుమ, వికసిత పద్మముల ముద్రను సూచించు నీ కటాక్ష ప్రసారములు ఒక పరి ఈ వైపు బఱపి మమ్మవలోకింపుము. 12

స్వైరచారి సుషమా క్షీరాబ్ధిలహరీ వి
హార శరీర! జోహార్లు నీకు
తులిత శిరోభూష! తుషిత పురసుర ప్ర
సృమర దయాబ్ధి! దండములు నీకు
ప్రజ్ఞాప్రముఖ మహిషీప్రద పట్ట బం
ధ మహిత సంతోష! నతులు నీకు
శ్రేష్ఠాశ్రమ చరితామృత పానగోష్ఠీప్ర
చలిత! గుణాబ్ధి! యంజలులు నీకు
లలితకరుణా సతీదేహ రచిత గంధ
ముఖ్యాపత్త్ర మకరికాంక! మ్రొక్కు నీకు
దివ్యతేజ స్తరంగిత దిగ్గుహాళి!
సృజిత లోకాళిభాగ్య! వోసిగ్లు నీకు. 13

భావజ పరితాప బడబానల జ్వాల
త్సంసార సాగర ధర్మనౌక!
దిక్పాల శీర్షరత్న కృతశాసన!
దివ్య మహిమ! జగదేక గురువ!
పారిబారిఁ జాల్వాఱు కరుణా రసపు వీచి.
చూరులఁ దిరుగాడు చూపు దేవ!
ధ్యానామృతలహరీ దర్శనచిద్వ్యాప్తి!
దేవాది సుర! జగదేకనేత్ర! 14

పరమ నిర్వ్యాజ ఖండిత నిరత గళిత
రక్తధారా శమితదైత్యరాజ జఠర!
సుకర నిర్వాణ నాటక సూత్రధార!
మహితలోచన! నీకు నమస్సు నమసు. 15

కేళి గంధర్వ రాడ్వధూ గీయమాన
దివ్య కీర్తి పూరిత దిశాదేశ! నమస్సు
భవ్యభక్తి నమ్రపావన వ్రత! నమస్సు
సకల ఫలదాయి! నీకునంజలిసుమాలు. 16

నిత్య నిరవద్యదానాది సత్యకార్య
ధిక్కృత సురపాదప కామధేను! నమస్సు
శుద్ధభావన! సుచరిత్ర శోభితాంగ!
ప్రథిత తుషితలోకధురంధరా! నమస్సు 17

పూర్ణిమాచంద్ర బింబ సమ్మోహనాస్య
విజితసుందర వారిజ విభవ! నమస్సు
శాంత భావన! మదన భుజాప్రవీర్య
శక్తిముష్టింధయ! మునిపూజ్య! నమస్సు 18

దివ్య శృంగార మండితదిగ్గజేంద్ర
భద్రశుండార పరిభావి బాహుదండ!
అధిక సౌందర్య కందముఖారవింద!
వరదరాజ! నీకియె మా వందనములు. 19

ఎల్ల దిశాముఖంబుల జయించినకాము సఖర్వ గర్వమున్
జెల్ల పడంగ గెల్చియడచందగువాఁడవు వీర! నీవె కా
వెల్లగుకొండ శృంగముల వ్రీల్చెడిమత్త గజేంద్రుదర్పమున్
చెల్లఁగ నీకగెల్చుటకు సింహము తక్క మఱొండుజాలునే 20

భువనములందు ద్వేషములఁ బుట్టెడి సర్వవిధాల తాపమున్
ప్రవికలమున్ బొనర్చ యడపన్ శరణిచ్చెడు పుణ్యరాశి! వెన్
దవదహనంబు శాంతిలనొనర్చుట కొక్క పయోదమే క్షమం
బవు నిదితక్క వేఱొకటెద్దైనను శాంతిలఁజేయగల్గునే 21

క్షితిలో మోహవుటంధకారతతిచే క్షీణించు లోకాలకున్
మతి గల్గించి ప్రబోధముల్ సలుపగన్ శక్తుండ వీవేగదా

క్షితిలోకులఁదగఁ జక్రవాకహితమున్ గావించు సూర్యుండె గా
క తతిమ్మ్రావెవి పద్మసంఘములకున్ గల్గించు నానందమున్ 22

ఎల్ల జనులయూహానదు లెండఁగొట్టి
జాలువాఁడవొకఁడవె తేజస్వీరాజ!
కల్పముల తుద బడబాగ్ని గాకయింక
నేది సాగరంబులను నెండింపఁ గలదు. 23

కడయెలేని సంసార సాగరము నిట్టి
యెల్లలోకాల దాటింప నీవతగుదు
క్షమను నాదివరాహంబుగాక యేది
పృథివి నద్దినుఁడి సముద్ధరింపఁగలదు. 24

అని సురలిట్లనేకముగ నాదరమొప్ప స్తుతించు స్తోత్రముల్
విని దరహాస వక్త్రుఁడయి వేగ ప్రసన్న హృదంబుజంబుతోఁ
గని తుషితాధి నాథుఁడిటు క్రమ్మఱఁ బల్కె గభీరమేఘ గ
ర్జన మృదుమంథరాన మధురాక్షర దీధితు లుల్లసిల్లగన్॥ 25

ఓ దేవేంద్రప్రముఖులైన దిక్పాలులారా! మీరందఱు ఆదరముతో
వచ్చిన పనియేమి ఏదియేని నావలనఁ బనికలిగిన ఈ స్తుతి వాక్యములింకఁ
జాలించి వచ్చినపని తెలుపుఁడు అని తుషితాధి నాథుండు పలుక, వారందఱు
ప్రసన్నచిత్తులయి వినయనమ్రములైన పూర్వ కాయంబులువంగునట్లు మోక
రిల్లి "దేవాదిదేవా! జగంబు వ్యామోహమున మున్గిన జగంబుఁ బ్రబోధింపనిది
సముచితమైన సమయము" అని మా బుద్ధికిందోఁచుటయు విన్నవింప నరు
దెంచితి మనివారు విన్నవించుటయు విని యిదిపఱకెన్నండు నిట్టి కోర్కె విని
యెఱుంగను అని తలఁచి యర్హంబగు కాలంబెది, దేశంబెదియని యొక
క్షణంబు ధ్యానస్తిమిత లోచనుండై యుండి అదియంతయు నిశ్చయించుకొని
గుణఖనియైన ప్రథిత వృత్తశీలంబులుగల, యాదేవదేవుండు మరల వారితో
నిట్లనియె. "నేను శుద్ధోదనునికి సుతుఁడనై సత్యముగ మూఁడులోకములకుఁ
బ్రబోధము గలిగింతును. అంగములతో, ధనములతోఁ బ్రాణములతో నిదియే
పూర్వము ప్రార్థింపఁబడి యగణ్యపుణ్య నిచయయంబులుగల బుద్ధజన్మను

పొందఁగలను, అని సత్యసంధుఁడును పరులకు హితముగూర్పఁ బరాయణుండయినవాఁడును ప్రజ్ఞాదిపారమ్య నిష్ఠుండునగు నాదేవదేవుండు పలుక ప్రముదితమనస్కులయి మేనియంగంబులందంతటఁ బులకాంకురములునిండ నుత్ఫుల్లలోచనులై యా దేవగణంబులు యథేచ్ఛం దమ తమ లోకంబులకుం జనిరి.

ఇటులన్ గొన్నిదినంబులన్ దివిని దేవేశుండు తానుండి యు
త్కటమైనట్టి వ్రతంబులన్ గనుచుఁదీర్ఘాలెన్నొ సేవించుచున్
స్ఫుటభక్తిన్ తపముల్ సలుపు నాభూకాంతునర్ధాంగిదౌ
పటు గర్భంబునుజొచ్చె లోకముల గర్భక్లేశముల్ పాపఁగన్. 26

ఇది

రెండవయాశ్వాసము

# బుద్ధ భగవానుని చరిత్ర

## మూఁడవ యాశ్వాసము

### మాయాదేవి గర్భము తాల్చుట

అంత పవిత్రురాలైన యా రాజుపట్టమహిషి గర్భము సమాధియుక్తమైనవిద్య ఫలించినట్లు ఫలించెను.

పిదప శాక్యవంశజుల కభ్యుదయ మొదవ
సఖియల నయనాలకు వికాస మ్మొసఁగ
సత్పురుష మానసముల కాశ్వాసనముగ
నృపతియర్ధాంగి గర్భదౌహృదముదాల్చె. 1

ఆమె గర్భము ధరించుటకుఁ బూర్వము కలలో ఒకతెల్లని యేనుఁగు ఉత్తరాషాఢనక్షత్రమున తన శరీరమునఁ బ్రవేశించుచున్నట్లు చూచెను. కాని ఆమెకందుచేనేమాత్రము కష్టముకలుగలేదు. ఆమె గర్భవతియగుటయు

అలరియు వృద్ధిపొందెనదు మంతమునన్ భ్రమరాలు వ్రాలు నా
జలజములట్లవై యురసిజంబులు భాసిలె, స్తబ్ధదృష్టిలోఁ
బొలుపగు రాజిసిన్ వెలిమిబోటులు నూహలుచేసి మంతనం
బులఁ గనుచుండ గర్భమదిపొల్చె జగంబుల సంతసంబుతో 2

మునులకుఁగూడ మాన్యుఁడయి పొల్పుచునుండిన బోధిసత్త్వుఁడా
తనుతరగాత్రి గర్భము ముదంబునఁ జొచ్చి వెలుంగమనస్సుకంటెఁగూ
డను బహుసూక్ష్మమై తగు పదంతికి మధ్యము గర్భధారణన్
గనుటఁ బ్రమోదమట్టులను గాంచెను వృద్ధి క్రమక్రమంబుగన్. 3

మహితమూర్తి గల్గు మహిషిమధ్యభాగ
మెట్టులెట్లు ప్రవృద్ధమై యెసగుచుండె
అట్టులట్టులె పుత్రులు పుట్టుచుండు
నెంతొ చికిత్సిన నృపుఁడేను వృద్ధిపొందె. 4

నవతుల ముఖాలతోపాటు సరసిజాక్షి
నళినముఁబోలు చనుమొనల్ నల్లఁబడియె
ప్రభువు కీర్తిమండలముతోపాటు మిగుల
వీత్తగర్భాలస ముఖంబు తెల్లఁబడియె. 5

వివిధమైన యౌషధి విద్యఁ బెద్దలైన
వైద్యులో గర్భగత పుత్రపాలనంబు
చేసి, రదె స్మరాపాయంబుచేతఁ గుందు
మూఁడులోకాల పాలనంబుగఁ దనర్చె. 6

ఇంద్రతుల్య లక్ష్మిగల రాజేంద్రుఁడపుడు
ప్రకట గర్భభారముగల పట్టమహిషి
కన్యయానురూపత శుభమౌ ముహూర్త
మందుఁ బుంసవ నాదికృత్యములు జరపె. 7

## పుత్రజన్మము

ఇట్లు దేవసముఁడగు శుద్ధోదనునిరాణి మాయాదేవి తనగర్భమందు వంశలక్ష్మినిధరించి శ్రమ శోకము మాయలనుండియు ముక్తురాలయి పరిశుద్ధమయిన పావన వనముందుండఁగోరి ధ్యానమునకు యోగ్యమైన యేకాంతవనమందలి యిచ్చచేఁ బలురకములైన చెట్లతోనిండిన చైత్రరథమువలె సుందరమైన లుంబినియను వనముననుండఁ గోరి యాయె శుద్ధోదనునితోఁ జెప్పెను రాజును కుతూహలముపొంగ నానందముతో ఆమెయందలి ధార్మికత్వమును ఉత్తమాశయముగానెంచి యామెను ప్రసన్నురాలిని చేయు తలంపుతోడనేగాని విహరించుటలంపునంగాక యా సుందర వనమునకు ఆమెను బంపెను ఆమెయును శ్రీమంతమయిన యా వనమందు ప్రసూతిసమయమును నిరీక్షించుచు నీలిచాందినితో నందమైన పానుపునందు నారీసహస్రములు అభినందించుచుండ శయనించియుండెను అంత ప్రసన్న

మైన పుష్యానక్షత్రమునాఁడు భద్రమైన ముహూర్తమున వ్రతములచే
సంస్కృతురాలయిన యామెగర్భమునుండి సహస్రభానుని ప్రభాతవేళవలె
శీతరశ్మిని ప్రదోషలక్ష్మివలె భువనైకనేత్రుఁడైన కుమారుని ఆరాజపట్ట
మహిషి ఏమాత్రము కష్టముగాని వ్యాధిగాని లేకుండఁగనెను. జంఘ
నుండి ఔర్వుండువలె హస్తమునుండి పృథువువలె ప్రశస్త మస్తకమునుండి
యింద్రసముఁడయిన మాంధాతవలె గర్భమునుండి కక్షీవంతుం
డునువలె * ఆమెపార్శ్వమునుండి యుత్తముఁడైన కుమారుఁడు జన్మించెను.
క్రమముగా నాబాలుండు ఆవిధముగ గర్భమునుండి వెడలి అయోనిజుఁ
డయి యాకసమునుండి యూడిపడినవాఁడువలెనై యనేకకల్పములనుండి
భావించినయాత్మ గలిగి మూఢత్వముదాటి జ్ఞానియై పొడగట్టెను.

అంత వికాసముం బరిమళాదృతిమించుచు నైదురంగులన్
వింతయి యెంతో యచ్చెరువు నింపెడి తామరపూల తోఁట ల
త్యంతము కప్పివైన కమలాకరపంక్తులు కాన్పలేయఁగే
రింతల బాలకుండు విహరించుటకుంబలె భూమి భాసిలెన్. 8

కొమ్మలు రెమ్మలున్ జివురుఁ గొమ్మల గొంజివురాకు రెప్పలన్
గుమ్మున సౌరభమ్మెగయ గుప్పెడు తామరపూల బార్లు నే
త్రమ్ములఁజేసి పల్తెరు లతావలు భూములు పుత్రజన్మకా
లమ్మునఁ జూచి మోదమున రంజిలి యెంతయునొప్పె నయ్యెడన్ 9

ఈయాకాశమున దమాజనన మట్లో బుద్ధబీజ ములున్
ఏయేదేశమునందు నుండవనుచున్నిమ ట్యాలో కాఁకన్
చేయుల్లార్చుచు స్పష్టమౌటు ప్రదర్శించున్. భువి గూడ నీ
యాకాశమును బి పద్మములచయ, బయ్యెన్ మహాపూర్వమై 10

---

* శ్రీరాముడు పుట్టినప్పుడువలె శ్రీకృష్ణుఁడు పుట్టినప్పుడువలె బుద్ధుడు
పుట్టినపుడును అతిలౌకిక మహిమలు జరిగినవని చెప్పుదురు ఏడుగురు పరివారులు.
మహామాయపుట్టినిల్లు దేవదహపట్టణమునకుఁ బోవుచుండగా మార్గమునలుంబి
నియను శాలవనములో బుద్ధుఁడుపుట్టినట్లు బౌద్ధగ్రంథములు చెప్పుచున్నవి

ఈ సిద్ధార్థు మహోపదేశములచే నీజీవలోకాళి కెం
తో సత్యంబుగ సంస్కృతి వ్యాధుల తంతుల్ పోవ నిర్వాణ మిం
దే సంప్రాప్తమయ్యెనయప్డు నరకాగ్నిజ్వాలతోనేమి యం
చా సర్వంబగు ఘోరమైన నరకాలందెన్ సునిర్వాణమున్ 11

కొండ నడయాడు నట్టుల గురువులైన
యా మహాత్ము గభీరమౌ యడుగు లూన
సైపనిదటు విశ్వంభర సత్వరంబ
యెదలు గిరిబంధములతోఁ జలించిపోయె 12

తాటికాయల యంతేసి నీటిజలలు
నేలఁజీలుచుకొని వేగ నింగికెగిరె
అట్టి పుణ్యాత్మునికి భక్తి నంజలింప,
గదలు శేషవశ్యాహిలోకములు వోలె 14

ఎల్లెడ విస్తరిల్లి ప్రవహించెడి యాకసగంగ సీకరుల్
తెల్లని వామనాయనఘు చేటల దేఱిన కీర్తిపూరముల్
వెల్లుగ పొంగిపార్లి తెలివెల్లలు కొల్లగ వేసెనోయనన్
ఎల్ల దిశాంతభాగములు నిండయి స్వచ్ఛములయ్యె నెంతయున్ 15

మునులకు నిర్వాణంపు ఘనిఁబుట్టె నొహో యనిసర్వలోకపుం
జనులకుఁ దెల్పఁ దామరిగి చాటివచించెడినో యనన్ మహా
ఘనముగ దుంధుభుల్ మొరసెఁ గాహళులెచ్చెను శంఖముల్ ధ్వనిం
చెను తమయంత మద్దెలలు చెప్పెను మంగళవాద్యముల్ తగెన్ 16

ఆ మహానుభావు నభిషేకమును జేయఁ
కడఁగివోలె తల్లిగట్టులెల్ల
దాటిపార్లి వార్ధి తరఁగలు పైపైకి
పొంగివచ్చె మిగుల మోద మెనఁగ, 17

మేరువు చలి చియచలమన్ పేరుఁబాసె
ఉదధి స్థలియించి విడిచె క్షారోదకాఖ్య

నదులు స్తిమితమై తగి స్రవంత్యాఖ్యవిడిచె
స్థిరయనెడిపేరు భూమి త్యజించి కదలె॥ 15



బహుళ మృదంగాది వాద్యవిశేషంబులు
దిగ్గృహాంతరముల బిగ్గ మ్రోగె
ఆనంద నృత్యాల యధిక భ్రమణముల
భువికదలి కదల్చె భూధరముల
బండారురాసిళ్ళు మెండుగ తెగిపోయి
సరులు ముక్కలయాకసముల చేసె
చల్లిన గంధాల పొళ్ళు బుక్కాలును
సింగారపున్ ముగ్గుహంగులలరె
బండారుల భూషలల్లాడి యూగిపోయె
శిరముల మణులు పడి చెల్ల చెదరులయ్యె
మూఁడులోకాలఁదనయు జన్మోత్సవముల
శ్రీలు నేకపట్టణమునఁ బోలఁగ్రాలె॥ 16

## పుత్రజన్మోత్సవ వర్ణన

ఆ బాలుఁడు శరీరకాంతిచేతను ధైర్యముచేతను భూమిపయి నవతరించిన సూర్యుఁడువలె మిగులదీప్తుల వెదఁజల్లుచున్నను చంద్రుఁడువలెఁ జూడఁబడుచు నందఱ నేత్రముల నాకర్షించెను. అభినవ గర్భచ్ఛాయచేఁ బాటలమైన రంగుగల సుతునిచే నాతని మాత నవోదయరక్తిమ గలరూపంబుగల సుధాకరునిచేత నుదయవేళవలె మిగులఁ బ్రకాశించెను.

మేల్మిబంగరుద్యుతిగల మేనిచేతఁ
బురిటిశయ్యకుఁ బుట్టును బరగియుండ
అపుడె నడిరేయి దీపములాత్మకాంతి
పోవనుదయతారకలట్లు పొదలుచుండె॥ 17

అంత నాబాలుఁడు సప్తర్షి నక్షత్రములువలె గంభీరమైన ఏడడుగులు వైచెను. బోధకొఱకు జగత్తుల కళ్యాణమునకై ఈ నా పుట్టుకైనది యని సింహమువంటి గతిగలిగి పుత్రుడుపలికెను. ఆకాశమునుండి చంద్రకిరణముల ఒకటి చల్లనై రెండవది వెచ్చనయి రెండు జలధారలు అతని శిరస్సుపైని

పడెను. అందాలీను చాందిని క్రింద గరుడపచ్చలుదాపిన బంగరుపానుపు పయిఁబరుండిన యాశిశువును బంగరుపద్మంబులుదాల్చిన యక్షులు పరివేష్టించి సేవించిరి. అదృశ్యులై యుండి దేవతలు ఆశిశువు ప్రభావంబుమాచి తలలు వంచి శ్వేతచ్ఛత్రము నాకాశమునఁబట్టి నీవు బుద్ధత్వమునుపొందెదవుగాక యని ఆశీస్సులిచ్చిరి. ఇదివఱలో గడచిన బుద్ధులను సేవించిన మహానాగములు ధర్మమునందలితృష్ణతో పైని వీవనలువైచుచు అచ్చెరువుగలమాపుల ప్రసరింపఁజేయుచు మందారపుష్పాలను గురిపించినవి. దేవతలభినందించిరి ఆశిశువు జన్మసమయమున భూధరములనెడి మేకులచే బిగింపఁబడియు వాయువుచేఁ గొట్టఁబడిన నౌకవలె భూమి చలించెను. చందన సువాసనలు గలిగి నీలికలవలుగల వర్షముకలిగెను.

దిశలును ప్రశాంతిగనె హాయి విసరె గాలి
భానుఁడును బూర్వమునకంటె భాసఁజిమ్మ
వాయువు దివ్యవస్త్రాలఁ బఱచి చిమ్మ
అగ్నులును ప్రసన్నమగుచు నలరెనపుడు॥ 18

నివాసభూమికి ఉత్తర పూర్వదిశయందు స్వచ్ఛజలముతో నిండిన నూయియొక్కటి తనంతనె ప్రకటమయ్యెను తీర్థంబులందువలె అంతఃపుర స్త్రీలు అక్కడ ఆశ్చర్యముతో నిండి ఆశ్చర్యకర కర్మలాచరించిరి ఆ బాలుని దర్శనమునకై దివ్యులును ధర్మాఢ్యులు నగువారు అరుదెంచిరి. చెట్లుగూడ వేడుకతో అకాలమగు నాకాలమునఁబూవులువల్లెను. పరస్పరము సహజద్వేషముగల జంతులు ఒకచోటఁజేరి స్నేహముతో మెలఁగినవి మానవజాతిలోనున్న రోగములు మాయమయ్యెను. మృగములు పక్షులును మౌనము వహించినవి ఆకాశమున దేవతలును దుందుభులు మ్రోగించిరి ఒక కామదేవుఁడు తక్కఁ దక్కిన దేవతలందఱును సంతోషమున నోలలాడిరి. ఆతనిజన్మ జగన్మోక్షమునకగునని ప్రపంచమంతయునుల్లసిల్లెను.

అట్టి యత్యద్భుతంబైన యాత్మతనయు
జన్మవార్త నంతిపురంపు జనులు చెప్ప
క్షితిపుఁడానందమున సొమ్మసిల్లి స్తిమితుఁ
డగుచు నేమి చేయవలెనో యరయఁడయ్యె॥ 19

పార్థివుఁడు రాణి ఆనందపరవశులయి
కరము నానంద బాష్పముల్ పరిసిరపుడు
నృపతియప్పుడు తనకున్న దెల్లనిచ్చె
ఏది దానమీవలయునో యెఱుఁగకయును॥ 20

తల్లియొడిలోఁ బరుండి భాసిల్లుచున్న
తనయునిన్ రాజు శుభముహూర్తంబునందు
ఱెప్పపాటు వేయక చూచెఁ బ్రీతితోడ
వాహినితటాన హంసశాబకంబునట్లు॥ 21

తనయు ముఖచంద్రుఁగను గొన తహతహపడి
రాజు నేత్రములె తనివితీఱకయె తెఱవ
ఒడలు పులకింప నానందమొంది రాలు
బాష్పములు చూడనీయవు బాలునతని॥ 22

తల్లి పొత్తిళ్లనా చిన్ని తనయు మోము
అధిక సౌందర్య దీప్తుల కాటపట్టు
దానియందాలు కన్దొప్పఁ ద్రావఁగోరు
నృపతి చివరకెట్టులో చూచి తృప్తిచెందె॥ 23

## పుత్రుని గుణములను బ్రాహ్మణులు వర్ణించుట

ఇట్టి యద్భుతగుణములు కల పుత్త్రుని బ్రాహ్మణులుచూచి యిట్లనిరి ఇట్టి బాలునివలన మీ వంశము వర్ధిల్లఁగలదు. ఈతండు దుఃఖమున మునిగిన లోకముల నుద్ధరించును ఈతండే గనుక సామ్రాజ్యమున నిచ్చగలవాఁడేని గ్రహములలో సూర్యుఁడువలె సమస్తభూమిలోని రాజులకు రాజయి చక్రవర్తి కాఁగలఁడు మోక్షమందివ్వ గలవాఁడేని తన జ్ఞాన సత్యముల ద్వారా సమస్త సంప్రదాయముల జయించి సర్పములలో నాగరాజయిన శేషువలెఁ బ్రకాశింపఁగలఁడు ధాతువులలో బంగారమువలె, పర్వతములలో మేరుపర్వతమువోలె, జలాశయములలో సాగరంబుకరణి, గ్రహంబులలో చంద్రునివిధమున, అగ్నులలో సూర్యునివలె మానవులలో నితఁడు శ్రేష్ఠుఁడు. ఈ బాలుఁడు కనులు ఱెప్పపాటు తెఱుఁగక ప్రకాశించుచున్నాఁడు విశాలములు నిర్మలములు స్నిగ్ధములు

నైన యాలోచనములు సమస్తమును జూడగలవు అని విన్నవింప "ఈతని గుణములు పూర్వపు మహాత్ములయందు మాత్రము లేవా? ఈతనిలో గల విలక్షణమేమి" అనుడయు నా బ్రాహ్మణులిట్లనిరి "ఓరాజా! వినుము రాజుల బుద్ధి, కర్మ, కీర్తిజ్ఞానముల విషయములో ముందువెనుక అనుసంగతిలేదు వినుము ఇదుఁగొన్ని దృష్టాంతములు చెప్పెదము వంశకరులైన భృగువు, అంగిరుఁడు అనుమహర్షులు రచింపని రాజ్యనీతి శాస్త్రములను వారి పుత్రులు శుక్రుఁడు బృహస్పతియును రచింపరే సారస్వతుండు నష్టమైనవేదమును వ్యక్తపఱచఁడే పూర్వులు దర్శింపక వసిష్ఠుఁడుచేయని వేదవిభాగమును వ్యాసుఁడు చేయఁడే చ్యవనుఁడు గూర్పకపోఁగా మొట్టమొదలుగా వాల్మీకి లౌకికవాఙ్మయమున శ్లోకమును సృజింపలేదా? అత్రికూర్పని చికిత్సాశాస్త్రమును ఆత్రేయుఁడు గూర్పఁడె కుశికుఁడుపొందని బ్రహ్మర్షిత్వమును గాధిసుతుఁడు విశ్వామిత్రుఁడు పొందలేదె. ఐక్ష్వాకులు బంధింపని సముద్రవేలను సగరుఁడు నియమించి బంధింపలేదె యోగవిధిలో ద్విజులు పొందని యాచార్యత్వమును జనకుఁడు పొందలేదె. శూరాదులు చేయని విఖ్యాతకర్మలు శౌరిచేయలేదే కనుక వయస్సుగాని వంశముగాని ముందు వెనుకలుగాని శ్రేష్ఠత్వమును పొందనేరవు పూర్వపురాజులుగాని ఋషులుగాని చేయనివి వారిపుత్రులు తరువాతివారు గావించిరిగదా" అని బ్రాహ్మణులు విన్నవింపఁగా శుద్ధోదనుఁడు ప్రహర్షోత్ఫుల్లలోచనుఁడై ఆద్విజసత్తములకు ధనాదులిచ్చి సత్కరించి తమ తమ గృహంబులకుఁ బంపెను అంత నొకదినంబున —

## అసితఋషి వచ్చి రాకొమరుఁడు బుద్ధుఁడగునని చెప్పుట

సచ్ఛకునముల వేఁ దపశ్శక్తిచేత
ధరణిపు జన్మ జన్మాంతరములు మఁ
దెలిసి సద్ధర్మమందలి తృష్ణచేత
వచ్చె నసితుఁడన్ ఋషి రాజభవనమునకు 24

బ్రహ్మవర్చస్సుచేఁ దపోబలముచేత
వఱలు నా బ్రహ్మవేత్తను బ్రహ్మవిధుఁడు
రాజగురువు గౌరవము మర్యాదమీఱ
పృథ్వీపతి భవనంబు ప్రవేశపెట్టె. 52

౩, ఆశ్వా. అసితఋషి రాకొమరుఁడు బుద్ధుఁడగునని చెప్పుట 29

అంత నసిత ఋషి నృపతి యంతిపురము
చొచ్చి యాసుతజన్మకు మెచ్చిమదిని
సంతసిల్లి తపోభరమున జరనుజిక్కు
మేనిచే వసంబయు రాజుమేడదరిసె॥ 26

అవలన్ భూపతి మౌని నాసనమునం దాసీనుఁగావించి భ
క్తివినమ్రుండయి పాద్యమర్ఘ్యమిడి ముంగేల్మోడ్చి యర్చించి ధ
ర్మ్యవిధిన్ సర్వవిధోపచారముల సంభావించి పూర్వమ్ము మా
న్య వసిష్ఠున్‌గని యంతి దేవుఁడటులన్ గావించె విజ్ఞాపనన్॥ 27

"ఈవు ననుఁజూడ వచ్చితి విందువలన
ధన్యుఁడనునైతి వంశమున్ ధన్యమయ్యె
ఏమొనర్తు నాజ్ఞాపింపుమిపుడు సౌమ్య
శిష్యుఁడను నను విశ్వసింపవయ్య"॥ 28

అని రాజేంద్రుఁడు విన్నవింప నసితుండాశీస్సులందించి ఋ
ష్ణునె, నాశ్చర్య విశాల ఫుల్లనయనుండై "నినున్ బోల్ మహా
త్ముని యందియ్యది యెల్లమేలు, ప్రియధర్మున్ త్యాగినాతిథ్య ప్రి
ష్మని నిన్నన్ గులమున్ బలంబు వయస్సుం బోధంబుచేరెన్ తగన్॥ 29

అటులె రాజర్షులెల్లరు నెంతొ సూక్ష్మ
మైన ధర్మముచే, ధనార్జనంబు
చేసి విధియుక్తదానముల్ చేయుచుండి
ధృతిఁ దపోధనుల్ విభవ దరిద్రులయిరి॥ 30

ఏమి వచ్చిన పనియేమొ యిపుడె చెపుడు
వినివిని పొందుమానందమో నరేంద్ర!
ఇనుని పథి దివ్యవాణిని వినితి. జగతి
బోధకై నీకుఁ గొమరుండు పుట్టెననుచు॥ 31

అనియసితమహర్షి పలుకులయువిని ప్రమోదమునఁ బొంగిపొల్లు నడకతో
నా నరేంద్రుఁడు ధాత్రియంకమందున్న కుమారుని ఆ తపోధనునికిఁ

జూచెను. అప్పుడు ఆబాలకుని పాదములందున్న చక్రరేఖలను బ్రేక్షయం దును కాలుచేతులందును గలవలలవంటి రేఖలను దట్టమైన వెండ్రుకలుగల కనుబొమ్మలను ఏనుంగునకుంబోలిన యతని వస్తికోశములనుజూచి యామహర్షి విస్మయమొంది దేవిమొడియందలి యత్రిపుత్రునివలె ధాత్రియొడిలోని యాబాలునిజూచి కనుబొమ్మలు మాటిమాటికి జలింపఁ బైకిఁ బొంగి పొర్లివచ్చు కన్నీటితో వేడిగనిట్టూర్చు త్రిదివంబువయికి మోమిడియుండెను అట్లు కన్నీటిచేతఁ దడిసిన కన్నులుగల యసితమహర్షినిజూచి యానృపతి తన తనయునిమీఁది స్నేహమునఁ గంపించి గద్గదకంఠుఁడై బాష్పములచే బొంగురువోయిన కంఠముతోఁ బ్రాంజలియయి వంగిన యంగములతో ఆ మహర్షితో నిట్లనెను. ఈనాకుమారుని శరీరము దేవతల శరీరముకంటె స్వల్పమె యంతరము గలదిగదా ఈ తనిజన్మము ననేకాద్భుతములతోఁ గూడియుండి దీప్తిగలదిగదా వీనిభవిష్యత్తు ఉత్తమమై యుండునని తమరె గదా యంటిరి. అట్టిది ఓధీర! మీరెందులకుఁ గంటఁ దడిపెట్టితిరి. ఓయి భగవానుఁడా! యీకుమారుఁడు దీర్ఘాయుష్మంతుయియుండునుగదా! నాకితఁడు శోకంబుకొఱకుఁ బుట్టడుగదే ఎటులైనను నాకితండు ఇన్నినీళ్ళు వదలును గదా. వీఁడు వదలిననీళ్లు త్రాగుటకింకను నాకుఁ గాలము రాలేదుగదే, నా యశోనిధానము క్షయముగాక యుండెనె నావంశీయుని చేతిలో రాజ్యము ధ్రువమై యుండునుగదా. నేను గాఢనిద్రచెందినను పుత్రునియందు నిమేషములేని కన్నొకటియైనను గలిగి తెలుచుకొని పరలోకమును సుఖముగాఁ జేరుదునుగదే నాయీ వంశాంకురము విచ్చకుండనె యెండిపోవునా! శీఘ్రమె తమరు వచింపుఁడు తమసుతులందు బంధువుల కెంతటి ప్రేమ యుండునో తమకుఁ దెలియనిది కాదుగదా అని రాజుకొడుకునకు అనిష్టమేదైనఁ గలుగునేమోయని శంకచే గ్రుచ్చిగ్రుచ్చి యడుగుటయు నపుడు ఆముని యిట్లు పలికెను

"శిశువున కనిష్టమగు నని చింతఁజెంద
నన్నుగూర్చిన చిం చే భిన్నుఁడైతి
నులువుకాని జన్మక్షయ సూక్ష్మబోధ
నిశఁడు వేయుదాఁక బ్రతుక నిందు నేను॥ 32

క్షమ సామ్రాజ్యము వీడి భోగములలోఁ గాంక్షన్ విసర్జించి శ్రీ
శ్రమయౌ యత్నముచేసి తత్త్వముల పారంబొంది మోహాంధకా
రముఁ బాప ఘనసాల జ్ఞానమయ సూర్యజ్యోతి వెల్గించి యు
త్తమబాలుండితఁడే జగంబులకు బోధల్ సేయు నిర్వాణమున్॥ 33

తరుణ వ్యాధుల ప్రోవు పెన్నురుగు, వార్ధక్యంపుఁ గల్లోలముల్
మరణోగ్రంపు దురంతవేగములు పర్వన్ నిండు సంసార దు
స్తర దుఃఖాంబుధి పారమున్ గనఁగ సర్వంబైన లోకంబులన్
దరియింపఁగల జ్ఞాననౌక నడపన్ దాఁబూనుఁ శాక్యానియై॥ 34

నిశితప్రజ్ఞలు వీచ్చు సుస్థిరపు నచ్చేలాలు ప్రాకారముల్
ప్రకటంబైనవ్రతాలు చక్కవలు సంప్రజ్ఞాసమాధుల్ స్వామా
ననవిశ్రాంతినిగూర్చు శీతలములుగాన్ భాసిల్లు ధర్మంపు స్వ
చ్ఛపరస్సుల్ గను జీవలోకము ఇఁక తృష్ణన్ బాపికొంద్రీవయిన్॥ 35

పథి తప్పువారికిఁ బలె విషయాటవి
భ్రాంతులకును మోక్షపథము చూపె
గ్రీష్మాలమబ్బు వర్షించినటు రాగ
దగ్ధుల ధార్మికోదకము కురియు
చేల దీపంబులు వోలెను మోహాంధ
జనులకు జ్ఞానతేజస్సులొసగు
పాశబద్ధులఁ గరవాలమువోలెను
తృష్ణార్గళముల భేదించివైచు
బాలుఁడితఁడు పెద్దవాడై నవిమ్మట
బద్ధ సర్వలోక పాశములను
త్రెంచు నింక నెవఁడు వీని ధార్మికబోధ
వినఁడొ వాఁడె శోచ్యుఁడని యెఱుంగు॥ 36

మఱియు నిట్టి గుణసాగరుని బోధవినక ధ్యానము ప్రాప్తించినను నేనుఅకృతార్థుండనె ఇతని ధర్మంబులను వినని కారణముచేత స్వర్గవాసమును కూడ విపత్తుగానే నేను భావింతును" అనియిట్లు అసితమహర్షి వచింపఁగా విని

యా శుద్ధోధనుడు సంతోషముపొంది నాకుమారుఁడిట్టి గుణసంపన్నుఁడుగదా నాకంటె నితఁడు సారవంతుఁడుగాదే అని సంతసిల్లెను. కాని యాబాలుఁడు ఋషులమార్గమునఁ జరించుననిమాత్రమే యతని హృదయము చింతిత మయ్యెను. నిశ్చయముగా రాజు ధర్మప్రియుడుకాకపోలేదుగాని అతనివల్ల వంశము నశించునేమొ యనిమాత్రము భయపడదొడంగెను. పిదప అసిత మహర్షి యిట్లుతత్త్వమును కొడుకునిగురించి చింతించు రాజునకు నివేదించి తన తమ్ముని కొడుకును బుద్ధత్వమును పొందినపిదప నితనితో బోధనలను వినమని నియోగించి లోకులు చూచుచుండ వాయుమార్గమున వచ్చినట్లు వెడలిపోయెను.

౨ వ

## మూడవ అధ్యాయము

—(౦)—

# బుద్ధ భగవానుని చరిత్ర

## నాల్గవ యాశ్వాసము

### రాకొమరుని జన్మవేళ సర్వార్థములు సిద్ధిపొందుట

క్రమత శిశు జాతకర్మాదికము లుదార
రీతిని బురోహితునిచేఁ జరిపియు రాజు
లోకముల ప్రశస్తినిగాంచి లోకములను
అన్యులొందని యానంద మాతఁడొందె. 1

తరుణ మేఘునిచే నభస్స్థలి విధాన
నిగ నిగని నూత్న చంద్రుచే నిశియపోలె
నే హా శిశువుచేత నతివ చెలువ మొనఁగ
ఆ తనయుచేత సంతతి యలరి వెలిఁగె. 2

పిదప ఆ రాజు పదిదినములు గడచినపిదప ద్విజులకు వేలకొలది హేమశృంగంబులు గల యావులను దానముచేసి యా లుంబిని వనమునుండి పురము ప్రవేశింపఁ దలఁచి ఏనుఁగు దంతములచేఁత దీర్పఁబడిన పల్లకిని తెప్పించి తెల్ల తెల్లని పువ్వులతో నలంకరింపఁజేసి మణిదీపంబులు వెలుగుచుండ సమస్త దేవతలకు నమస్కరించి మాయాదేవి బియుబుదేవు నాపల్లకిని అధిరోహింపఁజేసి అమాత్య పౌరవృద్ధ సంఘంబులతో దివమును అమరపతి వలె తన పురమును ప్రవేశించి, షడాననునిచే నీశ్వరుండువలె నలకూబరునిచేఁ గుబేరుండువలె అలకాపురంబుకోని కపిలవస్తు పురమును జొచ్చెను.

జన్మరోగ జరామృత్యు సకల దుఃఖ
నాశకుండగు బాలు జన్మంబు మొదలు

ఉదక వేగాలచేతను నుదధివోలె
దినదినము గణాఢ్యా సఖి వృద్ధియుఁ దనర్చె॥ 3

అపుడు నృపతి కోశాగారము దు మిగుల
ధనము రత్నాలు బంగారు గనులు మీఱి
నిండియుండెను కోర్కెకేనియు దొరకని
భాగ్యముల నొప్పెను గపిలవస్తుపురము॥ 4

పద్మ సమమౌ గంధేంద్రాల వలననైన
హిమనగములోని మత్తగజేంద్రము లెవి
నృపతి మండలమునకు రప్పింప లేమొ
అవ్వి నేడు యత్నములేకె ప్రాప్తమయ్యె॥ 5

రక రకపు టంకముల చిహ్నాలను దనర్చి
మేలి బంగారు నగలొప్ప జాలువ్రేల
తగిన గుఱ్ఱాల మైత్రిచే ధనముచేత
లబ్ధమై యాపురినినుండి లక్ష్మిగూర్చె॥ 6

అతని రాజ్యాన నప్పుడు నావులన్ని
పుష్టి తుష్టి గలిగి స్వచ్ఛముగ నగుచు
ఎత్తయిన దూడ నిటను గంతిడుమనుండ
కుంభములకొద్ది పాలిచ్చి కామదుమిగిలె॥ 7

అపుడు శత్రులు తటస్థులయిరి మిగుల
ఇఁకతటస్థులో సఖులైరి యింక సఖులొ
కరము హితులైరి రెండు పక్షములవారె
యలరి నాకింక పరపక్షమైతె లేదు॥ 8

మందపవనంబు మధురమై మసలు మఱియు
మెఱయు సుంద్రని మెఱపుల మింటి మబ్బు
రాళ్ళ పిడుగులు లేని వర్షములు దనరి
తగిన చోటులఁ దగువేళఁ దనరె వాన॥ 9

ఘనకృషి శ్రమలేక ఋతువు ననుసరించి
నిండి కాలాల పంటలు పండె మిగుల
ఓషధులు మున్నటివె సారమొప్పి యెంతొ
రసము గలవై సమృద్ధిగఁ బ్రకటమయ్యె॥ 10

అమల సమయాలవలెఁ దను వ్యాధులు లేక
ప్రసవ కాలంబులందును వనితలెల్ల
హాయిగా సులువుగా సుఖం బడర సుతులఁ
గనిరి యెట్టి రోగంబులున్ గానిలేక॥ 11

యతులు తక్క మిగిలిన వారలిదరిద్రు
లయ్యు నెన్నఁడు నితరుల నడగకుండ్రు
ఎంత తక్కువ ధనమున నెవఁడుగాని
యడుగు వానికీయఁగఁ జాల ననఁడుపురిని॥ 12

నహుషుని సుతుఁడగు యయాతి మహిని బోలె
పితని మహిని బంధుల గౌరవింపనతఁడు
దానమిడని మానవుఁడు వ్రత బుహూన
నతఁ, డనృతభాషి, హింసకుఁడరయఁబడఁడు॥ 13

అలరుఁ దోటల గుళ్ళను నాశ్రమముల
కూపములఁ జలిపందిళ్ళఁ గోలనులందు
వనుల ధర్మకాములైన వారు ముందె
స్వర్గ భువిఁ బోలెఁ గర్మలు సలిపినారు॥ 14

కఱవునుండి యల భయ రోగములనుండి
ముక్తులై స్వర్గమునఁ బోలె బొలిచినారు
పతిని సతిగాని పతియును సతినిగాని
బంధువుల వ్యతిరేకింపకుండిరచట॥ 15

ఎవఁడు భోగాతులై కామమేనయఁబోడు
కోరెనింక ధనంబెవ్వఁడు కూడఁబెట్టఁ

డెవ్వాఁడు ధనంబుకై ధర్మమెంచఁబోఁడు
ధర్మమున నెవండును హింస దలఁచఁడెపుడు॥ 16

చౌర్యములు వైరములును నష్టంబులయ్యె
తమదు రాజ్యాలయులు లేక స్వస్థమయ్యె
పూర్వమున ననరణ్య భూములను బోలె
పృథివిపతి భూమి క్షేమసుభిక్షమయ్యె॥ 17

అర్కసుతుఁడైన మనువు రాజ్యమునఁబోలె
అట్టి సుతుఁగన్న రాజు రాజ్యమునవుడు
హర్షముచరించెఁ దాపము లస్తమించె
ధర్మము జ్వలించె కలుషంబు తరలిపోయె॥ 18

నృపతికులసంపదలిటు వర్ధిల్లుచుండ
ప్రజల సర్వార్థములు సిద్ధి పడయుచుండ
క్షితిపుఁ డాత్మజున్ సర్వార్థ సిద్ధుఁడనియు
మరియు సిద్ధార్థుఁడనియు నామమునుబెట్టె॥ 19

## మాయాదేవి స్వర్గధామముచేరగా కుమారుని గౌతమి పెంచుట

"స్వతనయు ప్రభావంబు దేవర్షి సమము
ఎంత ధన్యురాల" ననుచు నెంచి మదిని
హర్షమును పట్టజాలక యపుడె ప్రసవిని
* జననియైన మాయాదేవి స్వర్గమరిగె॥ 20

అవల నమరకల్పుని బాలునతని విన్ని
గౌతమి స్వసుతతో తేడ గనక చూచి
భావమున స్నేహమునఁ దల్లివలెను పెంచి
పెద్దవానిని జేయఁగ శ్రద్ధఁబూనె॥ 21

* సిద్ధార్థుఁడు పుట్టిన ఏడవనాడు ప్రజాపతియను గౌతమి యొడిలో నప్పజెప్పి మహామాయ చనిపోయెనని బౌద్ధగ్రంథములు:

ఆంశు నుదయించిమించు బాలార్కుఁడట్లు
అనిలుచే వృద్ధిపొందెడి యనలుఁడట్లు
సరస శుక్లపక్షంబునన్ జంద్రుఁడట్లు
క్రమముగా బాలుఁడును వృద్ధిగాంచిమించె॥ 22

వచ్చియును రాని తనయుని పల్కులెటుల
వినుచు భూపతి మానసమునఁ గరంగు
అతుల నటగాయకుల పాటలాటలకును
కవివరుల వాగ్విలాసకున్ గరఁగిపోఁడు॥ 23

## రాకొమరుని క్రీడావర్ణన

సహజ పరిమళంబు వెదచల్లుచు సంతత సౌకుమార్యమై
మహితము హృద్యమై తనరుమాన్యుని బాలుని సుందరాస్యమో
మహిళల కేళులందెటుల మాయక నవ్యరసాలు చిందుమన్
సుహితమునై నిరంతరము చోద్యపుఁ దామర పువ్వై యయ్యెఁగా॥ 24

మణుల మువ్వల గలగలధ్వానులచేత
తండ్రికిని ప్రమోదంబును దనరఁజేసి
తనదు ప్రతిబింబముల మణుస్థలులఁ జూచి
బాలుఁడాడెఁ జిత్రంబైన లీల మెఱయ॥ 25

ఆప్తులగు మంత్రి సుతులతో నాటలాడి
దుమ్మునక ధూళినాడెఁ బందెమ్మువేసి
ముందుగాఁ బోవు సంగర భూములందు
మించి విహరింపగా నభ్యసించు నటుల॥ 26

చేరి గంభీరముగ సింహ శిశులఁగూడి
నృపతిపుత్రుఁడు క్రీడలఁ దేలుచుండి
వేగ నద్భుతంబుగ నాత్మ విక్రమ బు
నేర్పుకొనువాఁడువలె నెగడి యొప్పు॥ 27

మణులగంటల గజగజధ్వానులు వినిన
హర్షమున రాజహంసము లనుసరింప
వానిలోనున్న రాజశబ్దమును సైప
కున్నవాఁడువోలెను వానిఁ దన్నివైచె॥ 28

గోళ్ళ యంకుశంబుల దెబ్బగొట్టి శిరసు
వదన శబ్దాల బృంహిత ధ్వనులఁ దెగడి
మంగళములచే మదజల మహితుఁడగుచు
బాలుఁడంతట మదహస్తి లీల జరిపె॥ 29

విచ్చినట్టి సంపెఁగదండ వెలసిదీప్తి
మూపులను జీవజగతికి బ్రాపుచూపి
దారకుఁడతండు దీపంబు తీరువెలిగి
తల్లిదండ్రుల దుఃఖాంధతమసుఁబాపు॥ 30

శైశవము దాటు నవనీతుఁ జలివి బాలు
అఖిలవిద్యల పరిశీలనార్థమంచు
క్షితిపతియుఁ దన తనయుని శీఘ్రముగను
అనఘుఁడాచార్య హస్తాల నప్పఁజెప్పె॥ 31

వేళ కేశ్వరు లుపదేశించెడి సమస్త
విద్యలను సమస్త విధపుఁ గళల
మించి బాలుఁడతఁడు మేధావియగుటచే
జలధి జలము మబ్బువలె గ్రహించు॥ 32

వేనినైన సామాన్యము కానిబుద్ధి
కల కుమారుని పొదివి విద్యలు వెలింగె
శారద స్వచ్ఛ గగనవిశాల దేశ
మంది మమృతాంశు కిరణముల యూర్ములట్లు 33

బిట్టు జనముల నానందపెట్టి మించి
తమములను హృదులహరించు తనయువేత

అమల చంద్రోదయముచే మహాబ్ధియుతుల
తనరి రాక్ష్యకులముగట్టు దాటిపొంగె|| 34

రవికి ప్రభవోలె బుధునకు ప్రతిభవలె
గుణికి దయవోలె దీపికకు శిఖవోలె
జలధికి సుధవోలె శశికి చంద్రికవోలె
చొప్పిన నవయౌవనశ్రీ సుతునికొదవె॥ 35

యౌవనపు సానపైఁ బెట్టి యలరువిల్తుఁ
డందమొంద మెఱుఁగుపెట్టినట్లు యతుల
అంగములు సులక్షణముల వ్యక్తపఱచి
సంధులన్ విభక్తములయి యెసంగిమీఱె॥ 36

అతని పదముల్ సహజ మనోహరములగుచు
వేలిరేకల యాకుల వెలయు నిరుసు
గలుగు చక్రంపుఁ జిహ్నల నలరిగోళ్ళ
ప్రభల జ్యోత్స్నలచేఁ బద్మవనుల నవ్వె 37

మూఁడు వళుల యలంకారములఁ దనర్పు
నడుము గలుగు పద్మోదనుకొడుకు మిగుల
వాసుకి పడగలపు మట్టఁబడిన చుట్టఁ
దనరు మందరగిరివోలెఁ గనఁగఁబడియె॥ 38

ఎటు సమస్తగుణముచే నృపతిసుతుని
యానితంబ బింబము పృథువై యెసంగె
అటు అశేషదోషములచే నతనినడుము
కృశము కృశమాచు శూన్యమై యెసఁగిపోయె॥ 38

పిండు నూగారుజండాల నీలికట్టు
పొతఁదలఁచి పూవిలుతుఁడు ప్రస్ఫుటముగ
త్రవ్వినట్టి గోయివలెను ధరణిపసుని
తనయు నాభిహృదము పొంపుఁ దనకులీను॥ 40

పంకజము మధ్యాన నెఱుకపడి క్రమించు
లక్ష్మికిని సద్దులేకుండులాగుచోటు
ఇచ్చుటకుఁ బోలెఁ బుణ్యాత్ము నితనిబొమ్మ
మధ్యమి విధ్యతటు విశాలమైతనర్చె॥ 41

పార్థివకుమారు వక్షః కవాటతటము
వజ్రమట్టులు సారమై వరలుచుంట
జనములు కవాటములు సదనములకు
రక్షకయిగాక శృంగార రచనకిడిరి॥ 43

ప్రజల పాలింప నేర్పునఁ బ్రాజ్ఞుఁడయ్యె
వాని బాహువు భుజగేంద్రు పడగపోలె
శత్రురాజుల దుర్వారశక్తి యగుట
భుజగములఁ బ్రోచు పరిఘపోలె నుండె॥ 43

పీనమెడ మనోహర సంనివేశమగుచు
ప్రస్ఫుటములైన రేకలవలన మెఱసె
గాఢమౌ నాదరంబునఁ గౌఁగిలిడిన
లలితకేయూర ముద్రలవ నఁబోలె॥ 44

ముద్దులొలుకు నాతని ముఖాంభోజమునకు
చెంగలువకును జాల విశేషముండె
ప్రథమమొ యచల మగు సరస్వతిని దాల్చు
చివరిదో చంచలమగు లక్ష్మినిధరించు॥ 45

ప్రముఖమగు వాని ముఖగతవాణి పలుకు
మంజు మంజీర శింజాన రంజితంబు
గోళ్ప్రవళ నవ్వు వెన్నెల కొమరుగులుకు
పల్వరుస ముత్తెపు సరంబువలె వెలుంగు॥ 46

వాని రమణీయమగు నాస్య పద్మలక్ష్మి
అతని గండంబు మణిదర్పణావలక్ష్మి

అతని కర్ణపాశము విలాసాఢ్యడోల
అతనిచూపు లలిత విహారాబ్జ సరసి॥ 47

ముగ్ధమూర్తి యా నతని కన్బొమ్మ తీవ
కంటిగ్రుడ్డుల ద్యుతిచిందు రెంటియందు
అతని కోదండలీలయొ యతను గెలిచి
వశపరచుకొని యెక్కిడు భ్రమరనారి॥ 48

బెడఁగు కనుబొమ్మల నడుమ సుడిని బొలిచి
జ్యోతులొలుకు నాతని వదనోజ్జ్వలాబ్జ
మమృత రశ్మి రేఖయులోన నలరుచున్న
బాలరవి బింబలక్ష్మి లీల మెఱయు॥ 49

కనుబొమల నడిమిసుడిన్ జెన్ను మీఱు
నృపతిసుత ఫాలభాగం బదె తొ మించె
వప్రదేశల విఱిగి లోపల నడఁగు
ద్విరద దంతాంకురవు మేరుచఱియవోలె॥ 50

అంగరక్తిలేక యంగదంబులులేక
మండనములులేక దండలేక
నలరియు సుతుమేను నభిషేక యోగ్యమై
యౌవనమున మిగుల నందగించె॥ 51

హరిణనేత్రల నానంద పఱుచునట్టి
దన్యపురుషులలో మునుపగపడనిది
సహజ భూషలు గలదియై సకలగాత్ర
మందతనికి సమష్టిగ నందమొలికె॥ 52

సురపతి సమప్రభావుఁడౌ క్షోణిపతియు
ప్రథిత విశ్వంభరా భార సహనయోగ్య
భుజుఁడు సుతునికి జల మంత్రపూత రత్న
కుంభ యౌవరాజ్యాభిషేకంబు చేసె॥ 53

ఇది

నాల్గవయాశ్వాసము

# బుద్ధ భగవానుని చరిత్ర

## అయిదవ యాశ్వాసము

ఇటులు సకల గుణములచే శుభలక్షణంబులచే సకల సౌందర్య సౌభాగ్యములచే భూషిత సర్వాంగుడైన సిద్ధార్థ కుమారునిజూచి శుద్ధోదన మహారాజు అమిత సంతోష పుష్టాంతరంగుఁడయ్యును అసితమహర్షి చెప్పిన బుద్ధ ప్రాప్తి నిగురించిన భావిసంగతులకు నై శ్రేయసమును స్మరించి యొకవేళ తన పుత్రుఁడు విరాగియయి కామంబులఁ ద్యజించి వనములకుఁ బోవునేమోయని చింతించి యతనికి భోగములందు సంగము జనించుటకై యనేక సుందర దృశ్యములను ఏర్పాటు చేసిపిదప—

కులమున్ వర్ధిలఁజేయు పుత్రుని కనుంగుంగాంత నొక్కర్తుఁ బెం
డిలి చేయం దలపోసి పుత్రునికి నేలీలాంగి యిందర్హయో
తెలియంగోరి స్వకీయ బంధువులతోఁ దీవ్రంబ చర్చించుచున్
గలయన్ దేశములంతటన్ వెదుకగాఁ గావించె యత్నంబులన్. 1

### యశోధరా సిద్ధార్థుల వివాహవర్ణన

ఇది యిట్లుండఁగ నింతలోఁ "గులమునన్ హెచ్చైన మాణిక్యమై
* యుదయ బైన యశోధరాఖ్యసుత నీయుత్కృష్ట పుత్రుండు కే

---

* ఈ యశోధర అనుపేరు బుద్ధఘోషుఁడు చెప్పలేదు అశ్వఘోషుఁడు చెప్పెను. చిన్నతనములోనే సిద్ధార్థుఁడు విరాగియై యున్నట్లును ఇతనిని రాజ్య భోగములందు తగుల్కొనునట్లుచేయ తండ్రి వివాహము చేయఁదలచి స్త్రీలకుఁగానుకలిప్పించు నెపముతో యువతులకుఁగానుక లిప్పించుచు అతని చూపుపడిన యశోధరను వివాహము చేసినట్లు ఇతర బౌద్ధగ్రంథములు చెప్పుచున్నవి. యశోధరకు గోప, మృగజా, ఉత్పలవర్ణ అను నామములు గూడఁగలవు.

బుఁదావంబట్టఁగనిత్తు" నంచుఁ గబురున్ శీఘ్రంబుగా దూతచే
సదనన్ గోళియరాజు పంపవిని యత్యానంద పూర్ణాత్ముఁడై॥ 2

సరి యటులె యని శుద్ధోదనక్ష్మాధిపతియు
కోళియధరాధిపతికి జాబుపంప
నాతఁడును మహానందమునంది యపుడు
తనయ పెండ్లి మహోత్సవంబును నొనర్చె॥ 3

ఆకసంబంటుచు నలరు కేతులఁ గట్టి
తెల్లని పట్టు చాందిని రచించి
ఇంద్రధనుసులటు నెగురఁ దోరణములు
వాకిళ్ళఁ బూర్ణకుంభములు నింపి
ముత్యాలహారాలు మురువుగ వ్రేలాడఁ
గొమరు పూవుల గుత్తు లమరదిద్ది
భవనాల కక్ష్యాలఁ బలు రంగురంగుల
ముత్యాలముగ్గుల పొలుపు దీర్చి

అంతిపురమెకాక యఖిల పట్టణమున
నాగి వివాహ శుభమహోత్సవంబు
జరిపెఁ గోళియ నృపసత్తముఁడంటు
సుతకు గుణధరకు యశోధరకును॥ 4

అపుడు వరాంగనలైన యామె చెలికత్తెలు ఆ కుమార్తెకు తలంటు పోయ సుగంధతైలముపూసి సుగ ధామలకపుఁ బిండితో నలుగుపెట్టి మణి కుంభములతో నభిషేకించిరి స్నానమైనపిదప నీటఁదడిసిన వసనంబువీడి శారదరాత్రి పండు వెన్నెలనుబోలె ఆమె తెల్లని యుందాలిడు పట్టుపుట్టమును దాల్పను సింగారించుటలో జాణలయిన యామె చెలియలు నాలుగిండ్ల భవనంబున నామెను కూర్చుండఁబెట్టి రంగురంగులును, సువాసనలును, చిమ్ము పువ్వులు కురులందుఁ దురిమి వివిధ భూషణంబులచే నలంకరించిరి. అపుడు ఆ తరళేక్షణకు నల్లని పట్టుకుచ్చులవంటి మెత్తని నునుపైన పెనుకురుల కొమ్ముడిలో నిచ్చిన మల్లెపువ్వులను తురుమఁగా నామె చెల్లా చెదరైన

చక్రములచే నింపయిన కలికచీఁకటి గల యాకసమువలె శోభిల్లెను. సుంత వంకరలగు కురులచే నామె మోముఁ దామర గ్రుమ్మరించు సౌరభంబుల కాసపడి మునరి వ్రాలిన తుమ్మెద బార్లవలె ప్రకాశించెను. సిందూరము రంగరించి యా పెండ్లికుమార్తెకుఁ బెట్టిన చేరు చుక్కయును ప్రభుత్వాధి కారము పొంది చెలాయించు మన్మథుని ప్రతాప బాలచంద్రునివలె భాసిల్లెను ఆ కమలేక్షణ చెవుల వ్రేలుచున్న గఱికిపోచలును మూడులోకములను గెల్చిన మన్మథునికీర్తి కేసరములవలె విజృంభించుచుండెను కస్తూరి పంకముచే చిత్ర చిత్రములుగఁ జెక్కునందు రచించిన రేకలవలయము చంద్ర బింబశ్రీలు కురియుచు మబ్బుల గాజులచే లోన మలినమైన యద్దమువలె నందముల గ్రుమ్మరించుచుండెను నల్లని కాటుకపెట్టిన యా మీనలోచన కన్ను మిగుల తీవ్రమైన హాలాహల పంకముపూసిన యనంగుని బాణమువలె మెఱసెను. ఇతరులకు సాధారణముగాని యెఱుపుగలయామె మోవి యిదె వఱకట్టిది లేని లత్తుకరంగుతో నింత యైశ్వర్యములఁ గురిపించుచుండెను. మఱియును

ముత్తెముల కుండలములతోఁ బొలుచు వధువు
క్రొత్త చిఱునవ్వుచే ముద్దుగొలుపుమోము
రెండు వైపులఁగల పుండరీకములకు
నడుమఁ దనరు శరత్కృక నదము గెలిచె॥ 5

ముత్తియముల సరంబులన్ మురువులీను.
కంఠమునఁ బొల్చువధువెంతొ కాంతు లొలికె
ముత్తెపుం జిప్పలను శంఖములను వెలికి
గ్రక్క వెలుఁగు సముద్రంపు లహరివోలె॥ 6

మంచి గంధపుఁబూఁత రచించమించి
నల్లయగురు రేకల నుల్లసిల్లు వధువు
మేను, యమునా తర గాలలోను గలియ
మెసలు గంగానదియబోలె నెనఁక మెసఁగె॥ 7

మెఱయు గుండ్రని ముత్యాల సరములొప్పు
విమలగాత్రి వక్షఃస్థల మమరియుండె

3వ ఆ యశోధరా సిద్ధార్థుల వివాహవర్ణన

చెల్ల చెదరైన ముక్కల నుల్లసిల్లు
నస్త్రశైల శృంగంబును నతకరించి॥ 8

మూఁడు వళుల చేఁదగు నడుమునఁ దనర్పు
వక్షమున నూగు హారాలు వఱలుచుండె
జిలుపు జిల్లులు కప్పిన చక్కవలును
మసలు నదివోలెఁ బెండ్లికుమార్తె వఱలె 9

మణుల మొలనూలిఁ జుట్టంగఁబడిన నడుము
దనరు నరపాల మౌళి యాతనయ యపుడు
వార్ధిమణి గర్భవేలచే వలయిత మగు
సైకతము గల్గు వసుమతి సరణినుండె॥ 10

ఎత్తయిన బొమ్మ పర్వాత మెక్కుచున్న
మదనునికి సూతకఱ్ఱగాఁ బొదలునట్టి
నీలిరంగు నిందీవర మాలవోలె
ఆమె నూగారుపంక్తి యొయ్యారమొలుకు॥ 11

వెలలేని పైఁడినగలచే నలరునామె
పూవుగుత్తుల నడతీవఁ బోలె
లత్తుకరక్తిచే హత్తు నామెపదాలు
రేయె దలోఁ దమ్మిచాయ గెలిచె
అందాలుగన నద్దమరసెడి యా కాంత
పూర్ణశశి గల తూర్పు దిశమించె
హస్తాబ్జమునఁగాక స్వాంతాబ్జమందుఁ బ
రోధసుల్ రక్ష సూత్రాదులిడిరి

ఇటు కుమార్తెను పెండ్లికై యింపులెన్నొ
వెలయు సింగారములు దీర్చి పెండ్లికొడుకు
రాకకై కేశియపతి మార్గమందుఁ
గడుఁ గుతూహలత నెదురు గనుచునుండె॥ 12

అంత నా రాజసూనుండగు సిద్ధార్థుఁడును జలకంబులాడి సుగంధము మేన నలంది ధౌత వసనంబులు దాల్చి లోకుల లోచనముల నానందపెట్టు వివాహంపు టలంకారములకుఁ దగిన భూషణంబులు ధరించి.

బంగరు సన్నదారములఁ బాగుగ చేసిన పట్టుకండువా
హంగుగ వల్లెవాటుగ నొయారమదాల్చి, మెఱుంగు దీపియల్,
రంగులు చిమ్మఁగన్ దగు శరత్సమయంబుల మేఘమాలచే
నింగివలెన్, విరాజిలుచు నెమ్మదికెంతయుఁ గూర్చె మోదమున్॥ 13

పృథుల వక్షస్స్థలంబున వ్రేలుచున్న
ముత్తెములమాలచే రాజుపుత్రుఁడలరె
వెడఁద చఱియ దరినిముట్టి వెలసియున్న
మెఱుఁగుఛాయా పదముచేత మేరువటుల॥ 14

మధుర గంభీర తనువున మనలు నతఁడు
కొమరు పగడంపు ముత్తెపుఁ గుండలముల
నమరె సూర్యచంద్రుల మండలములచేత
మురువుగానుండు మేరు భూధరమువోలె॥ 15

మంచి గంధంబు లలఁదఁగ మించె వరుఁడు
అలఁతి యెండ నెఱ్ఱని యుదయాద్రివోలె
గైరికాది ధాతు ‹ లము గజముపోలె
సంజ కెంజాయ నద్దిన చంద్రుఁబోలె॥ 16

మణుల భూషణమును దాల్చు మహితుఁడతని
అద్దమునఁ బ్రతిబింబించినట్టి బొమ్మ
భానుమండల మధ్యస్థుడైన పూరు
షోత్తమునివలె శోభల నొంది వెలిఁగె॥ 17

మీఱి సహజమౌ నతని శరీర కాంతి
భూషణంబయి యెంతయు పొలుపులీనె
ఇతర మాణిక్య భూషణా లెల్లనైతె
వాని కైశ్వర్య చిహ్నలై పరిఢవిల్లె॥ 18

ఆణిముత్యాల గొడుగు పైనమరియుండ
వేగ వింజామరంబులు వేయుచుండ
భద్రగజముపైఁ గూర్చుండి వరుఁడు వేడ్క
త్వరగ పెండ్లివారింటికి తరలివచ్చె॥ 19

అతులువచ్చిన శకరాజ వంశతిలకుఁ
గోశియాన్వయ తిలకుఁడౌ క్షితిపుఁ డపుడు
దూరముననె గని తనంత చేరఁబోయి
పెండ్లి పందిరి క్రిందికి వేగతెచ్చె॥ 20

అంత రాజపుత్త్రుఁడు మంటపమందయున్న
పూర్ణచంద్రాస్య నా రాజపుత్త్రిఁ జూచె
హస్తమున విలాసముగ పుల్లాబ్జమూని
కాంతి విఱఁజిమ్ము వారిధి కన్యఁబోలె॥ 21

దేహకాంతుల వెన్నెలల్ దెసలఁజిమ్ము
నా నృపాత్మజ నుత్కంఠతోనె చూచు
రాజసుతుని యానంద పారావరంబు
పొంగిపొర్లి గట్టులు దాటి నింగిముట్టె॥ 22

ముత్తయిదువలు చేయించు పుణ్యమైన
పనులనన్నియు వారు చెప్పినటు చేసి
పెండ్లికూతురుతోపాటు పెండ్లికొడుకు
పెండ్లిపందిరి దరినున్న వేదికరిగె॥ 23

హవిసులంపైకి జ్వాలలు నెగయు నగ్ని
కెదుటఁ గూరుచుండి యా పురోహితుఁడు దాను
నూతన వధూవరుల చే[illegible] ప్రీతితోడ
నింకఁ జేయఁదగునవి చేయించె నరిగి॥ 24

గుణమణిఖనియౌ నృపసుతు తనువదెల్ల
మెండు పులకాంకురములచే నిండెఁ గాని

కంఠమునుండి విపుల వక్షంబుదాఁకఁ
గ్రాలు పూమాల కేసరాల్ గప్పివైచె॥ 25

జైలు వెడలుచున్న జల కణాలచేత
చెమ్మగిలెఁ గేళియాత్మజ చేతిప్రేళ్ళు
పెండ్లిలో జలధార బిందులందు
పద్మపత్రలోచన కవివఁకలయ్యె॥ 26

కనుగొనగోరి ముందునకుఁ గ్రమ్మఁగఁ గ్రక్కున సాగిపోయి ని
గ్గున వెను వెన్కకున్ మరలి కొండొకచోటున నిల్చిపోయి యా
యనువున నామె క్రీఁగనుల యంచులమూవులు తాదృశస్థితిన్
వెనుకకుఁ బోవలేవు మఱి వెంటనె సాగక యూగులాడెడిన్॥ 27

పెండిలి మహోత్సవ సముద్రవీచి నేర్చు
సుడుల చక్రభ్రమణ లీలనడలఁ బోలె
వరుఁడు వధువుతోఁబాటుగా వహ్నిచుట్టు
మూఁడుసార్లు ప్రదక్షిణముల నొనర్చె॥ 28

ఇది వఱకెపుడున్ జూడని యింపుగుల్కు
రూపుదాల్చియున్న వధూవరులను జూచి
హోమవహ్ని ప్రదక్షిణ జ్యోతిరుమల
వంకయిడి తల పంకించి వలెను మెచ్చె॥ 29

నృపతిపుత్రిక తన పురోహితుఁడు చెప్ప
అగ్నిపైని పేలాలను నపుడుఁ జల్లె
చివురు దొడిగిన తియమావి చెట్టుపైఁ
గాలికల్లాడు తీవియపూలు వోలె 03

తొరగ బయలుదేఱిన హోమ ధూమపంక్తి
ఆమె మోము దామరపువ్వు నంటియుండి
క్రొత్తదియు నీలిదియు పొడుగుదియునైన
తమ్మితూడు రూపంబును దనరియుండె॥ 31

హోమవహ్నినుండియు లేచు ధూమపంక్తి
వరునిపాణిని గ్రహియించి స్వచ్ఛమైన
ఆమె మోము నందంటియు నదగించె
పద్మమునం దిర్గు తుమ్మెద బారువోలె॥ 32

హోమవహ్నినుండియు లేచు ధూమపంక్తి
వెలుకలి భ్రమఁబడు పరివేషమట్లు
వఱచు కాటుకవలె, గ్రుక్కువదనమట్లు
వాడు నల్ల కలువవలె వఱలె మిగులఁ॥ 33

ఈవిధముగా పాణిగ్రహణ మహోత్సవమైన పిదప ప్రియురాలైన యశోధరతోఁగూడ నరిగ సిద్ధార్థుఁడు తన యత్తమామలకు దల్లిదండ్రులకు తక్కగల పెద్దలకు నమస్కరించి వారి యాశీస్సులుపొంది సమస్త బంధు వర్గములు అభినందించుచుండ కేళియ రాజధానివెడలి నిజరాజధాని చేరి పురవీధుల నూరేగుచుఁ బ్రదక్షిణముచేయు సమయమున ఆనూతనదంపతులఁ జూచు వేడుకలో నొడలుమఱచు నా పురసుందరుల విలాస చేష్టలీవిధముగ విలసిల్లినవి.

## వధూవరులను జూచు పురసుందరుల విలాసచేష్టలు

వెలువమిన్న యొక్కర్తు క్రొంజివురుఁగేల
నెఱువుఁ దాతురపూదండ నిట్టె దాల్చి
స్వాయముగవరించు కోర్కెతో బలెను దొరగ
రాజధానిలో మెట్లమార్గంబు దరిసె॥ 34

వరుని వధువును కనుఱెప్పపాటు లేక
నరయు కంటికి నడ్డగునను మనెంచి
నీలికాటుక దుడిచి విశాల నయన
యొకతె కిటికీదరికి వేగనురికివచ్చె॥ 35

నగలుపెట్టుకొని యొడలిన్ నగల చేత
కప్పినయెడ నా శరీరానఁగలుగు సహజ

కాంతి కనఁడని కాఁబోలు గాత్రమందు
నగలుదాల్పకయె కిటికీన్ దరిసె నొకతె॥ 36

విచ్చి వాసించు దీనిని వీనులందుఁ
దాలిచినఁ దుమ్మెదలు వచ్చి వ్రాలి నన్నుఁ
బాధపెట్టవచ్చునని యుత్పలము నొకతె
చెవులఁ దీసివేసి కిటికీచేరె త్వరగ॥ 37

రాజసుతు మోముచూచు హర్షమునఁ బొడము
పులకలే వక్షమునకు విభూషలనుచు
చెప్పుటకుఁబోలె మెయి విసర్జించి పూఁత,
యొకతె కిటికీదరికి వచ్చి యుండిపోయె. 38

పరపురుషుఁ బతివ్రత చూడవలదటంచు
చెప్పి యడ్డుట కననొక్క చెలియరశన
నడుమునుండి జాఱియుఁ గ్రిందఁబడుచు కాళ్ల
పట్టుకొనియుండి గట్టిగా వదలదయ్యె॥ 39

ఒంటిపేట ముత్యాపుసరం బొకతె మెడను
కేలుఁదమ్మి చేఁబెట్టకే కేలుదమ్మి
దానినిందాల్చి మనసు తొందరలు చేయ
నతనికిం గాన్కయిడుట కోయనఁగ వచ్చె॥ 40

ఆ వధూవరులను జూచు నాసఁగలుగు
పౌరకాంతలచే సౌధభాగములును
దట్టమయి జగంబులఁ గెల్వఁదలఁచు స్మరుని
సైన్యా నివహ ప్రతిమలట్లు సౌరుసింపె॥ 41

వీధి వీధులందు నొయార్ల వింత వింత
వంకర కటాక్షములు వానిపైనిబడియె
సౌధజాలాల నడ్డగించంగఁబడిన
యొడలుగల పుష్పశరు పూవుములుకులట్లు॥ 42

ఒకయవయవము కంటె వేఱొక యవయవ
మింక రమణీయమగుటనందేగరేక
చెవి విభూషదాఁకఁ బ్రసరించిన యపాంగ
మున విశాలాక్షు లరసియుఁ గనరుతృప్తి॥ 43

విస్మయంబున ఱెప్పయే వేయకున్న-
పద్మములకు మిత్రములైన-వారి కనులు
యతని యంగము లందెల్లఁ బ్రతిఫలింప
నతఁడు సాక్షాత్తు తగె సహస్రాక్షుఁ డటులు॥ 44

ఇచట నెచటకైతె కుమారు నెల్లమేన
నంగనలు తమచూపుల నంపినారొ
అచట నచటనె తత్కాంతు లనెడు జిగురు
పొలచేబలె వారంటుఁ బడిరి మిగుల 45

కదలి మెదలకుండను విప్పు కనులతోడ
యాతురతఁ జూచు పూఁబోండ్లయాత్మ జార్తి
పోవఁ గొట్టినదివలెఁ దత్ప్రతుమూర్తి
వనితల ప్రతియొక్క హృదిలోపలను జొచ్చె॥ 46

అపుడొకతె యెల్లమెయిఁ బులకాంకురముల
నిండి విస్మృతాబ్జముతోడ నేమితేడ
తనని చేతిలోని విలాస కమలమపుడు
కనులుమూసి యాఘ్రాణించె మునిఁగి ప్రీతి॥ 47

మహిత మాకర్షణపు సిద్ధ మంత్ర మతను
కడనె మఱి యుపదేశంబుగని జపింపఁ
దలఁచి ముక్తాక్ష మాలికం బలెను నొకతె
పాణి ముత్యాలసరము త్రిప్పంగఁ దొడఁగె॥ 48

చిలుక ముక్కుఁబోలిన గోటి చివరచేత
పాణియందున్న మొగలిపూఁబట్ట రేకు

పయి నొకతె సన్నగీలు వ్రాయఁ దొడఁగె
వానికిన్ స్మర రేఖలు వ్రాయు దానిఁబోలె॥ 49

బొమ్మగీయు చిత్రఫలకమ్ములను కుంచెఁ
జివురుఁ గేలున ధరియించి చెలువ యొకతె
తనదు బొమ్మనుగీసి యాతనికి నీయ
యత్నమును జేయు నట్టుల నలరియుండె॥ 50

సంతతము మీఁద పడుచున్న స్మరుని పువ్వు
ములుకుల పరాగవర్షాలఁ గలుషమైన
యదియ పోలెను నట నొక సుదతిమోవు
వలికి వెడ జల్లు కన్నీళ్ల గలదియాయె॥ 51

మఱియు నొక్కతె గగుర్పాటుచే నందములీను గండపాళి కలదై మనోభవుని చిత్ర గృహప్రవేశమున మొలకలు పుట్టిన మంగళపాలిక వలె విరాజిల్లినది. ఆకర్ణాంతముగా లాగిన శరాసనముగల మదనుని బాణ పుంఖముల పొక్కులగాలిచే వలె విసరఁ బడుచు బాఱుచున్న యుత్తరీయము గలిగి యొకతె కంపించెను. బయలు వెడలిన వేడి చెమట బిందులచేఁ జిత్రితమై యొక్కతె దూరముగా లాగఁబడిన చెఱకువింటి తీవెనుండి వెడలు ముత్యాల సరముల నంకురితమై యుండెను. మనోవీధియందుఁ బ్రవేశించిన మదనుని చిమ్మఁబడిన పాద పరాగజాలములచేత శబలిత విగ్రహము గలదివోలె నొక్కతె ఎక్కువగా వివర్ణభావమును పొందెను. మఱియు నా పుర సుందరులిట్లు ఆ దంపతులను గూర్చి యనుకొన దొడఁగిరి. కులగిరి వలె శ్రేష్ఠుఁడైన పరమ సుందరుఁడైన యీ కుమారుని భర్తగాఁ బొంది యీ బింబాధరం యితర జన్మలలో నెంత యగణ్యమైన పుణ్యమును జేసినదో గదా, అబ్ధుములకుఁ బుట్టినిల్లైన చంద్రబింబమును లక్ష్మికి నివాసస్థానములైన పద్మములను పూర్వము సృజించుచు సుందరవస్తు నిర్మాణనైపుణ్యమును అభ్యసించి పిదప విధాత ఈ వదనమును తీర్చి దిద్దెను గాఁబోలు. భువనత్రయ నిర్మాణకాలములో ప్రోగుచేసి ప్రోగుచేసి సమర్పించిన సౌందర్యపు ముద్దచే పద్మసంభవుఁడు బహుశా ఈ యువరాజును నిర్మించియుండును. గడియవలె దీర్ఘమైన బాహువులు గలిగి మూఁడు లోక

ములచేఁ గోరఁదగిన శోభగల యీ యువకుని చూచుటకు లోకత్రయజ్ఞుఁడగు బ్రహ్మ మనకిపుడు పదివేల కన్నులను నిచ్చియుండవలసినది మఱి యెందుకట్లు ఇచ్చినాఁడుగాఁడు వీని వదనామృత రశ్మి బింబమునుండి బయలుదేఱిన సౌందర్యామృతమును ఉపయోగించుటవలన నెవరి నేత్రయుగము ఈ జన్మలోనే అనిమేషభావమును పొందకుండును" అని యిట్టి యుదారములైన పురసుందరుల వాక్యములను వీనులవిందుగా ఆలకించుచున్న నా శకవంశప్రదీపకుఁడైన రాజపుత్రుఁడు కపిలవస్తు పట్టణమును పదక్షిణముచేసి రాజాంతఃపురమును ప్రవేశించి దూరమువనుండి వంగిన శిరస్సుతో అంజలి ముకుళించి తన యర్ధాంగితోఁగూడి ప్రియ సంతోషముతో పొంగిపొరలు తండ్రికి నమస్కరించెను అపుడు శుద్ధోదనభూపతి యను కూలురాలైన భార్యనపుడు పొంది యిపుడు దూరముగావంగి నమస్కరించు చున్న కుమారుని లేవనెత్తి పైకెత్తిన భుజపంజరముతోఁ బులకాంకురములు నిండిన గాత్రముగలవాఁడై యాదరముమీఱ గాఢముగాఁ గౌగలించుకొనెను

అవల బంగారు పళ్ళెరాలందు వెలుఁగు
ముద్ద కప్పురంపు దీపములను దాల్చి
ముత్తయిదువలు భద్రాసమునను నున్న
నృపతి సుతునికి నీరాజనాలిడిరి ప్రీతి॥ 52

అటులన్ బెండిలియాడి విశ్వములఁ గీర్త్యబ్ధాక్షి స్థాపించి సం
కట పూర్ణ త్రిజగంబులన్ మనుప దీక్షన్ మధ్యబంధించి యు
త్కట పుణ్యంబులఁ గూర్చు పుత్త్రిఁగనుచున్ క్ష్మాపాలుఁ డానంద సం
పుటితో లోనఁ దల చె సోత్త్తమకులమ్మునన్ శత్రు ముక్తమ్ముగా॥ 54

ఇది
అయిదవ ఆశ్వాసము

# బుద్ధ భగవానుని చరిత్ర

## ఆరవ యాశ్వాసము

### యశోధరా సిద్ధార్థుల విహారములు

వర సౌభాగ్యమునిండు నూత్న వయసున్ ప్రాపించు దేహాన భూ
వర పుత్త్రుండు సనత్కుమార సముఁడై భవ్యాంగియౌ నా యశో
ధరతోడన్ - శచితోడ నింద్రుఁడటు-తత్తద్రమ్యా సౌధాంత రో
పరిభాగంబుల సుందరోప వనులన్ వాహ్యాళిఁ దేలెన్ దమిన్॥ 1

మనసునకెదేని క్షోభంబు పొనరఁజేయు
దృశ్యములు ప్రతికూలమౌ నెవియుఁగనిన
మతి విరక్తమౌనని యెంచి సుతుని రాజు
ఇలను గాక మేడలనె క్రీడింపఁ జేసె॥ 2

మఱియున్ సర్వము వైభవంబుగల యాత్మ నాథుఁ డత్యంత సుం
దర నూత్నోజ్జ్వల యౌవనంబున మహా నందంబునం ద్రేలి గ్రు
మ్మరు సిద్ధార్థునికిన్ ఋతూత్సవములన్ బాటించి కొల్వైన్ నిరం
తర యోగ్యంబగు మూఁడు మేడలు వడిన్ గట్టించెఁ బ్రీతిన్ బురిన్॥ 3

అతఁడా సౌధములందుఁ జిత్రతర విన్యాసాల్ విశేషాల్ దన
ర్పు తలాలందును నప్సరోంగనలటుల్ శోభిల్లు వారాంగనా
తతిఁ జూపించు విలాస నృత్య గతులన్ దర్శించుచున్ దైహిక
స్మృతిపోవన్ విహరించె భోగములచేఁ జిత్తంబులాంగం గడున్॥ 4

మండుటెండల మాడు మహితాతప జ్వరంబు
చల్లని జలముల శాంతపఱచి
సకల వనంబులఁ జరియించు నెమిళుల
కరయ నృత్యములు నేర్పు గురువె యగుచు

ఘనవాతములచేఁ గాఱు మేఘంబుల
    దిక్కు దిక్కులఁ బంపి దీప్తిగనుచు
నల్లని నింగియన్ నల్లత్రాచు విడుచు
    కుబుసంబువలె మేఘ కులముగనుచు

ఎలమి గూర్చు వర్షాకాల మేగుదెంచఁ
గని విహార మండపమెక్కి కాంతతోడ
ఒక్కనాఁడు సిద్ధార్థుఁడ యువిదకంత
జలదములఁ జూపి వర్ణించసాగె ప్రీతి॥ 5

ఇటు సరోజాక్షి! వీక్షింపుమీ మొయిళ్ళు
ఎటుల జలధి నీళ్ళు గనుచుండనే హరించె
ప్రబల గగన విలాస దర్పణమునందుఁ
జొచ్చు కువలయ బింబాల సొంపుగాంచె॥ 6

వంగు కనుబొమ్మ కలదాన! వర్షలక్ష్మి
మెఱుపుఁ దీవెల పుడకల మిగులఁబఱపి
ప్రోవుచేసిన కాటుకఁ బోలుమబ్బు
దొంతరల నింగి పాత్రమున్ సంతరించె॥ 7

చిరముగఁ బ్రవాసమేగి వచ్చిన పయోద
పాంథుఁడపుడె క్రొత్తగ విప్పి బాగ చిక్కు
దీసిన కురుల జడలట్లు దీప్తిచెంది
కాఱుమబ్బుల మాలలు కానిపించు॥ 8

వేసవి నిప్పులార్పిన బయల్ దేఱిన
    పొగలట్లు మేఘముల్ పొదలె మింట
ఇంద్రు భీతిని వార్ధి యెడదాగి ఱెక్కల
    సగురు కొండలువోలె నివె మొగిళ్ళు
మెఱుపుఁ దీవెల నిండు మేఘాంబరము, తుదిన్
    బగడాల బురదల వార్ధిఁబోలు

వని నృత్యములు సల్పి ధ్వనిచేయు నెమిళుల
మెఱుపుఁ గండ్లిడి మేఘుఁడుఱిమిమెచ్చు

నెమిళులున్ బాకలూది సర్పములఁ బట్టి
పెద్ద కేకవేయుచుఁ బురుల్ విప్పియాడు
వర్షఋతువు కంసాలి మబ్బనెడుగీటు
రాతి గీయు బంగరుగీత గ్రాలు మెఱుపు॥ 9

బాహ్యదేహంబొ మలినమై పరిఢవిల్లు
నాదు మానసమొ విశుద్ధమై దనర్చు
అనుచు మెఱసెడి మెఱపువంకను వెలింగి
మబ్బు విడఁదీసి చూపునామాడ్కిఁ దోచ॥ 10

పరశుల గిరి శృంగములందు మెఱపు లగలఁ
గూడియున్న మేఘముల పంక్తులును, ధరణి
మోయుచును నాలుగు సముద్రములకు మధ్యఁ
దగు వరాహపు హలవు గీతలను బోలు 11

విస్మయశ్రీ గలిగి దానవీర్యా మొప్పి
మూఁడులోకాలు గెల్చి నీ మొగిలురాజు
పైకి నెత్తినట్టి విజయధ్వజములేమొ
యనఁగఁ దరళాక్షిరో! మెఱపు లవిగో మెఱయు॥ 12

హంసములను దోలెడి వేత్రయష్టు గుచు
ప్రోషితుల భయపెట్టఁగనో లోలనయన!
త్రిప్పు కేళి వ్రేళ్లు వోలె దీప్తిచెందె
నీ మెఱపుఁ దీవెలాకాశ సీమయందు॥ 13

ప్రియా: చూడు. ఈ మెఱపుదీగ యను నారిఁగూర్చి యింద్రధనుసు అను వింటిని లీలగాఁగొని వర్షా ఋతువనెడి కిరాతుఁడు శర(=బాణ, జల) ప్రసారములచే భూమిని పుండరీక (=పద్మము, వ్యాఘ్రముల) శూన్యముగా నెట్లు చేయుచున్నాఁడో, సర్పములను నెమళ్ళు కక్కిన మణులవలె

నీ యార్ద్రపురుషులు, ప్రచండమైన వర్షాధారలచేఁ గొట్టఁబడిన రత్నగర్భ యగు భూమిలోనుండి చిమ్మఁబడిన రత్నోపలఖండముల కాంతులనెట్లు అధికముగాఁ జిమ్ముచున్నవో, అవిగో శరత్కాలపు రాత్రివేళయందలి యాకాశమువంటి కొత్త పచ్చని పచ్చికబయళ్ళపైని నిండుసంజలో నెఱ్ఱని నక్షత్రములవలె యీయార్ద్ర పురుగులు ఎట్లు ప్రాకుచున్నవో చూడు భూమ్యాకాశములకు మధ్యస్థలము ఎంతదో కొలుచుటకు బ్రహ్మ పంపిన కొలత్రాళ్ళవలె నీ నీళ్ళధారలెట్లు మేఘములనుండి పడుచున్నవో చకోరాక్షీ ఇటుచూడు ఎక్కువగా బకబకమని వాగు కొంగలతో ఈ మేఘమాలిక శంఖములుదాల్చి వెఱకు విలుకాని ప్రయాణమునకు జయభేరిని ప్రయోగించు నటులున్నది. అదిగో అక్కడఁ గాఱుమబ్బులనెడి యేనుఁగులు కొంగల యొయ్యారమువంటి శంఖకంఠములుగలవై ఘీంకారములనెడి యుఱుములతో వప్రక్రీడకుఁబోలె కొండలమీఁదికెట్లు వంగుచున్నవో ఇటు దిక్కాంతలు మెఱుపులనెడి సంపెంగదండలు ధరించి యింద్రధనుస్సు లనెడియందములైన శిరోభూషణములతోఁ గొత్తనీటిధారలుగల మేఘమాలలువంటి పిచికా గొట్టములతో నటులు ఒకరిపై నొకరెట్లు నీళ్లు పోసికొనుచుండిరో గ్రీష్మమును జయించి యాకాశభువనమును ఋతు సార్వభౌముఁడగు వర్షాఋతు చక్రవర్తి ప్రవేశించుచుండఁగా ఘనులు (మేఘములు గొప్పవారును)కట్టినతోరణ మాలికలవలె నీ యింద్రధనుస్సులెట్లు విలసిల్లుచుండిరో మేఘమనెడి యేనుఁగు చఱయలనెడి గండముల దురదలుపోవుటకై దిగంతభిత్తులను రాచుకొనఁగా రాలినవివలె ఈ వడగండ్లు చెల్లచెదరైన నక్షత్రములవలె తెల్లని ఛాయల రంగుగలిగి ఇవిగో ఇటుపడుచున్నవి మేఘాలునీళ్ళతోపాటు ముత్యములను గూడ సముద్రమునుండి తీసికొని తిరుగఁ జిమ్ముచున్నవివలె ఈ వడగండ్లు మిగులఁ బ్రకాశించుచున్నవి. ఆకాశమండలమున మెఱుపుల పుంజమనెడి యగ్నివర్షముతో నెట్లెట్లు విజృంభించుచున్నవో యట్టులటులె పాంథులహరిణేక్షణల మనస్సునందు మన్మథాగ్ని ధ్రువముగా విజృంభించుచున్నది. గ్రీష్మతాపముచే మండిపోయిన నభస్థలి స్ఫుటమైకందళి (=పుట్టగొడుగు) అను చేయిచాయి మనోహరములైన నెమళ్ళ కేకలచే మేఘుని జీవనమును (=నీళ్ళను, జీవితమును) ప్రార్థించుచున్నదివలె నున్నది. అడవి కడిమ పువ్వులను వికసింపఁజేసి పూవుఁగింజల్కలపు పుష్పాడులను దీసికొని

యీ మందమారుత కిశోరములు ఆడియాడి యలసిపోయిన నెమిళ్ళ నర్తకుల యాటల యలసటలను బోఁగొట్టుచున్నవి విశాలాకాశవీధిలో నిట్టటు సంచరించు మేఘములకాలి ధూళులువలె మందముగా జలకణములుపడుచున్నవి. మెఱపు ఆకాశమండలమును పిలువఁగా నవవైద్యుతాగ్నిని సాక్ష్యముగానుంచి ఋతువనెడి పురోహితుఁడు నదీ సముద్రులకు వీచికా పాణిగ్రహణమును చేయించుచున్నవాఁడువలె నుండెను. అమృతముల ద్రవింపఁజేసి సర్వ సంపదలను గలిగించు నావర్షాకాలమె కనుక లేకపోయినచో ఈ యశేష భూమండల మండలమును అన్నివిధముల గొడ్డురాలయి యుండెడిదిగదా॥

అని యిటుల నీమ వృత్తాంత మధిప సుతుఁడు
వాకొనుచునుండ మేఘంబు లూకొనుచును
సిగ్గుపడుచున్నయవివోలె దిగ్గుహలను
విడిచి యటనుండి మాయమై వెడలిపోయె॥ 14

దిక్సతులు పూనికొనెడి నేతి దగు పూఁత
రాజహంసలు విహరించు రాజవీధి
పద్మినుల యౌవనంపు విభ్రమవులీల
యయిన శరదృతువటు విజయంబు చేసె॥ 15

తను విలాస సంపదల సజ్జనన మొంది
వరబలాక లొప్ప మెఱపుఁ బ్రణయురాలి
విరహమునఁబోలె మౌనంబు విన్నఁదనము
పొంది మేఘులు వెలవెలఁబోయి చనిరి॥ 16

అడఁగిన స్వగుణముల వెల్లడి యొనర్ప
లజ్జపడి వర్షకాలముల్ క్షయముపొంద
అమల దిగ్మృగాక్షుల మోదహాసములటు
రాజహంస మండలములు ప్రకటమయ్యె॥ 17

అధిక ముత్సుకత గల రాయంచ విందు
శ్రవణములకు బాధ యిడుకోలాహలంబు

విని వియోగినులు కరుణో జనము నింద
వఱుమఁ గ్రౌంచరంధ్రకరుని పరశురాము 18

వనధిలోని యమిత ఫేనగణముఁబోలి
మదను కీర్తి గుత్తుల భ్రమ నొదవఁజేయు
రాజహంసల పెక్కు లభ్రమున వ్యాప్తి
గాంచి మిగుల దిగ్గుహలను గప్పివైచె॥ 19

వెలఁగి యేడాకుల చెట్ల పుష్పాళ్ల ది
జ్మృళు పరిమళ మార్గములుగ నయ్యె
మదియుఁము నేస్తలమదము విజృంభింప
నేగినన్ వానలు: నేర్లు పొంగె
సకల కళానిధికర పంక్తిదిశలఁ బా
వియుఁ గుముద శ్రీలవేగఁ జొచ్చె
ద్విజరాజుఁగని లజ్జ వెలిపట్టు వెన్నెల
ముసుగుతో దిక్కాంత మురువుమాపె॥ 20

తపన దావానలంబుచేఁ దగులఁబడిన
చీఁకటి తమాల వృక్షాల చెంత గాలి
చెదరగొట్టిన బూడిద చెన్ను దాల్చె
శారదాంబుద మాలిక సముదయంబు॥ 21

నలుగడల వ్యాపించు శారద మేఘములచేఁ జల్లఁబడిన యాకాశము క్షీరాబ్ధిమాలికా భంగములతోను యుగాంతక్షిన్నములైన సముద్రపు గాంతి ననుకరించెను మొదట మేఘజలములచే నభిషేకములు చేసికొని పిదప శారద మేఘసంచయముల వలువలు దాల్చి వెన్నెలలనుంచి గందములు మేన నలది దిగంగనలు తారకల ముత్యాసరాలు దాల్చిరి అప్పుడే మేఘములతో జలకములాడి రుచి రాంబరములు దాల్చిన దిగ్వధూటుల శరీరముల నంటు కొన్న నీటి తుంపరలవలె ఎక్కువగా నక్షత్రములు మిలమిలలాడుచుండెను. శీత చంద్రకిరణంబులు లాలింపఁదెల్ల కలువ కోశరాసులు శతత్ప9 సన్న ముత్త్యైన కొలకుల జలములందు బింబించి నక్షత్రములవలె సొంపు నింపు

చుండెను. వికసించిన దళముల కొనల యంకురములు ప్రకటింపఁజేసి పూవుల మరంద బిందువులనెడి యానందబాష్పములుగల సరోజ బృందములువచ్చిన శరదృతువును జూచి చిఱునవ్వుగలవి వలె విలసిల్లెను. నలువైపుల విచ్చిన తామర పువ్వులనుండి జాలువాఱు మరందధారలచే నిండి శరదృతువున చిక్కియుండినవయ్యును సరోవరములన్నియు నగాధములైనట్లు భాసిల్లెను పండినచెఱకుల కణపులనుండి ముత్తెములతో నిండిపోయి వరిచేల గట్లు తామ్రనదీ తటములా యనియనునట్లు పొడఁగట్టు చుండెను. పండి బ్రద్దలయిన దానిమ్మపండ్ల క్రొత్త గింజలచే రంగు రంగులయి యడవి భూములు మరల ఆర్ద్ర పురువులెట్లు వచ్చినవియని తోపించుచుండెను గుత్తుఁ గుత్తులుగా పండి తలలువంచిన వరిచేల యొయ్యారులు తమకు వచ్చిన యవనతస్థితికి చింతించుచు మొగములు వంచుకొన్నవి వలె పడియు డెను. చిమ్మిన బురద కొమ్ముచివరల కంటుకొనఁగా డెక్కల యర్ధచంద్రులచే బడ్లుతొక్కఁబడఁగా మరల అంకెలువేయుచు మదించియున్న యాఁబోతులు ఏటి ఒడ్డు కొమ్ములతోఁ జీల్చి విజృంభించుచుండెను.

## సిద్ధార్థుని విలువిద్యను రాజు చూడఁగోరుట

అది యిటులుండ నొక్కదినమందు నృపాలుఁడు పుత్రుఁ బిల్చి యీ
విధమునఁ బల్కెఁ "బుత్ర! యిదె వీరులు పౌరులు నీదువింటి వి
ద్యాదగఁ గనుంగొనందలఁచి యాత్రుతనుండి" రనంగ రాసుతుం
డిదెవిలువిద్య నాదియిఁక నేడవ రోజునఁ జూడుఁడీ యనెన్॥ 22

ఇఁక నా యేడవనాఁడు బాంధవజనంబెల్లన్ గడుం బ్రీతిఁ జే
రి కనుంగొంచును నుండ రాజును నటుల్ సింహాసనం బందు నుం
డి కనుల్ మూయక శ్రద్ధతోడఁ గనుచున్ దీవించ నాతండు పూ
నిక విల్లూని శరంబుతో గురునిముందే నిల్చె నమ్రాంగుఁడై॥ 23

తనువున్ గ్రమ్మఱఁ దాల్చివచ్చిన లతాంతాస్త్రుండొ కాదేని యీ
ధనువున్ బట్టి ధరిత్రి నీమదిగి చెంతన్ నిల్చు దేవేంద్రుఁడో
యని లోకుల్ వడిమూకలై పొగడఁగా నారీతి ప్రత్యక్షమై
యనిదం పూర్వపు శస్త్రవిద్య గురుముం దాతఁడు చూపెన్ వెసన్॥ 24

ఇటు ప్రదర్శించి విలువిద్య యెల్ల దరయ
అఖిల ధానుష్క గణములం దగ్రుండగుచు
బాలుడు మొదలు వృద్ధులు ప్రణుతి చేయ
నతఁడు రాజానుమతిఁ జొచ్చె యంతిపురము॥ 25

శారద మేఘమాలికలఁ జల్లని తెల్లని మేడలందు శృం
గారముగా రచించిన సురాలయ భాగములందుఁ జిత్త మిం
పార నతఁడు సర్వ ఋతుభాగ్య సుయోగ్యములైన భోగముల్
వారక పొంది, వీనుల రుచిరాంగుల మంగళ తూర్యనాదముల్॥ 26

తమి సంగీత మహోత్సవోత్సుక వధూతారుణ్య వార్ధిం మునిం
గి మెయిన్ మఱపెడి నృత్యనాట్య గతులన్ గేళీగృహాలన్ విహా
రములన్ జల్పుచు రామలంగలిని యారామాదులందుండి ని
త్యము గాలంబును బుచ్చుచున్ గడపె నాతండు కొన్నేండ్లిటుల్॥ 27

ఇది
యాదవ యాఖ్యానము



# బుద్ధ భగవానుని చరిత్ర

## ఏడవ యాశ్వాసము

### వసంతఋతు వర్ణనము

వచ్చెన్ వసంతఋతువున్ వడి నింతలోనన్
మెచ్చెన్ ద్విరేఫకులముం బిక గానరీతిన్
గ్రుచ్చెన్ స్మరుండును పువుల్ ములుకుల్ జగానన్
చొచ్చెన్ గృహాలు మలయచ్యుత మారుతంబుల్॥ 1

భయదుఁడౌ యము మహిషంబువలన మిగుల
భయపడిన వాఁడువలెఁ జండభానుఁడిపుడు
యముని దక్షిణదిశనుండి హయముత్రిప్పి
హిమగిరికి నుత్తరమువైపు నేగినంత॥ 2

మీనకేతను నాజ్ఞ వ్యాఖ్యానపటుమ
విమల చంద్రోదయ ముఖాన నమరియుండి
లలిత సూక్ష్మ వరాంబరుండగు వసంతు
వరుని గ్రహియించి వనిఁ బుష్పవతిగనయ్యె॥ 3

పండుటాకు కంచుకముల వదలివైచి
మొగ్గగమి గగుర్పాటుఁ బొడమఁజేసి
తీవియల తుమ్మెదల కురుల్ దెసలఁ గదిప
ఆ వసంతుఁడు విహరించెఁ బూవు వనుల॥ 4

మంద మలయ మారుత రథమందునెక్కి
దిగ్విజయ యాత్రకై బయలుదేఱు స్మరుని

పయిని పూవు కాన్పు పేలాల వానయయ్యె
గండుకోయిల కూతె శంఖరవమయ్యె॥ 5

వీచుగాలికి లేచు విరిదోట పుప్పొళ్ళు
స్మరు దిగ్విజయయాత్ర సైన్యధూళి
పరభృత వర్గాల వనవిహారంబులు
స్మరు బాణముల ప్రోగుపఱచు వనులు
స్మరవీరు శరములంబడు వైరిశరములై
భృంగాల్ మునరు గుత్తివిరులు నఱలు
విరి దేనెలన్ నిండి భృంగాల్ మునరు పువుల్
స్మరు నభిషేకించు మణిఘటాలు

మలయమారుత శిశులు ప్రోగులుగఁ బెట్టు
పోకతోటల సరిక్రొత్త పూలపంక్తి
మదన నరపతికిని గాలి పొదువవీచు
ఆ వసంతు చామరమాల యటుల వెలయు॥ 6

గండుగోయిల లనంగ జయకథ కూజి
తములు చూతపువనీ స్థలులఁ జదివె
ప్రమద మధుప దానరాజి మారుతహస్తి
స్త్రీ మానహృద్వప్రకీడ సలిపె
అనిల నృపతి వందులై మాతగజ ఢిండి
మాల భృంగతతి జేజేలొనర్చె
చివర మొదలుదాఁకఁ జెట్లు జివురుటెండ
మానినీ మాన తమస్సులడపె

సతత వికచ సుమ మరంద విశ్రుత నదులు
వనములను నదీమాతృకలనుగఁ జేసె
పువు మరంద నదీతటిఁ బుప్పొడిసుక
తిన్నెఁ బ్రియలతో భ్రమరాళిఁ దేనెలానె॥ 7

తీవెల యుయ్యాలఁ దేల్చి భృంగిని భృంగుఁ
డూపె జెక్కులగాలి యూదియూది

పువు టశోకపుఁ జెట్లఁ బువుఁదేనెఁ గ్రోలించె
 రతిసోలు భ్రమరిని భ్రమరుఁ డొదిగి
తీవెల తల్లుల పూవు గుత్తిస్తనాల
 భ్రమర శిశులు తేనె ప్రాలుత్రావె
వలుపోర్లఁ జివికిన విలునారివిడిక్రొఁజె
 ఱకు వింట నళిమౌర్వి లాగె స్మరుఁడు

మరు విజయగాథల వసంతు దరిని నేర్వ
రెమ్మ రెమ్మఁగోయిల శిశుల్ రేగి మొఱని
మగిడి కొమ్మచేతులనెత్తి మావితరులు
పాంథులకు స్మరాజ్ఞలఁ బికధ్వానులఁ దెలిపె॥ 8

కామినీ మానపు గజమాపు హేమాంకు
 శంపు మోదుగు కోశములు వెలసె
పొగరు తుమ్మెదఁబోలు మోదుగు గుత్తులు
 పొగఁజిమ్మ నిప్పుల పొలుపుచూపె
భ్రమరులరిప్పించు సుమగుచ్ఛ మది రాహు
 నందు ముద్దగనైన యిందుఁబోలె
చందన ద్రుమ సర్ప సంగంబుచేఁ బోలె
 చందన వాయువుల్ చంపు విరహి

న్వాంమధు దుర్దిన తమసుల వనవులక్ష్మి
పంపనేగి దూతికతెచ్చు భ్రమరి నొకతెఁ
జాటు వాక్యములఁ గొని యాశ్చర్య ఫణితి
భ్రమర యువకుండు విహరించె స్వైరగతుల॥ 9

పొగడ పూఁదోట లుత్తమ వనిత ముఖపు
సిద్ధ గండూష మధ్వభిషేకములను
అనుభవించి క్రొత్త మొలక లనెడి మిషను
సొంపు గగురుపాటు ప్రమోద శోభఁగనియె॥ 10

తీయ మావితోట షికార్లుతీయు నవ వ
సంత లక్ష్మల యందెల వింత రవళు
లటుల నింపుఁ గోయిలల శ్రావ్యంపుఁ బలుకు
లఖిల జనుల వీనుల విందు లాచరించె॥ 11

నెలత నును మోముదమ్ముల నిండియున్న
మధు రసంబుల మర్యాద మరగి గ్రోలి
పొగడగున్న దానినె మరి మిగులఁ గ్రక్కె
ప్రీతిఁ జిమ్మెడి పువుఁ దేనెకైతవమున॥ 12

తరుల పరిమళ లహరుల నెఱపుచున్న
ముదిత సకల దిగంతర నదులలోన
మలయగిరి మ ద పవనముల్ మసలి మసలి
దీర్ఘముగ జలక్రీడలఁ దేలియాడె॥ 13

స్మరుడు గుండ్రముగా భృంగ మౌర్వి లాగ
వెడలు టంకారముల నిండి కడు ధ్వనింప
సకల సా సారిక మతులు వికలమొంద
మావి పూతముల్కలవాన మహిని గురిసె॥ 14

నడిమి వయసునఁ గొత్త యందాల వెలసి
యా సనత్కుమారుఁడటు సిద్ధార్థుఁ డపుడు
శాక్యసుత యశోధరతోఁ బ్రహర్షాబ్ధి మునిఁగి
లలిత సహస్రాక్షుఁడు శచితోవలె మెలంగె॥ 15

సుతుఁ డిట్టుల్ సుఖ భోగభాగ్యములతో శోభిల్లి యున్నన్ సుదా
గృతి నా రా"జెపు డెట్టు లౌనో" యని మౌనీంద్రుండు నాఁడన్న వా
క్కె తలంచె, సుతుఁడేవియైనను వ్యథాదృశ్యాలు వీక్షించునో
క్షితి నంచున్ భవనాగ్ర భూమినె సదా క్రీడింపఁ జేసెన్ సుతున్॥ 16

శర దబ్దంబులఁ బోలె దెల్లనయి భూస్థానిన్ విమానాల యా
కరణిన్ రంజితమై సమస్త ఋతు సౌఖ్యాధారమౌ, హర్మ్య సుం

దర భాగంబుల గాయనీ వర నటీ నాట్యాది సంగీత సం
భరితంబైన వినోద లీలల మదిన్ మైమర్చె సిద్ధార్థుఁడున్॥ 17

సును బంగారు జరీ దుకూలముల వెన్నెల్ కప్పునంగాలు హె
చ్చిన మద్దెళ్ళ పయిన్ వరాంగనల ముంజేవ్రేళ్ళ వాయింపులన్
వినువీథిన్ నటియించు నచ్చరల పల్ నృత్యంబులన్ ద్రోసిరా
జను లాస్యంబులనయ్యొ రాసుతుని ప్రాసాదాలు కైలాసముల్॥ 18

జిలిబిలి పల్కులన్, గళల, జెన్నొసరెలాడు హావభావ లీ
లల, మదకేళులన్, మృదు విలాసల, సుందరహాసభాసలన్
లలితపు భ్రూ విలాసలను, లాలన, వెచ్చని కౌగిలింతలన్
వెలి నబమోడ్పు క్రీగనుల నింపిరి ముంచిరి రాసుతున్ సతుల్॥ 19

రుచిర కళోపాధ్యాయిను
ల చేత రతి కర్కశలగు లలనల చేతన్
సుచిరము పట్టుకొనఁబడి ది
గి చనఁడు మేడ నతఁడు దివిఁ గృతపుణ్యుఁడటుల్॥ 20

## శుద్ధోదనుని ధర్మదీక్ష

తన కుమారుఁడిటులుండఁగని తన పుత్రుడు వృద్ధిపొందుటకే యతని భావి ప్రయోజనముచేఁ బ్రేరేపఁబడి తండ్రియగు శుద్ధోదనుఁడు శాంతియందు విహరించెను. పాపములను విరమించెను ఇంద్రియములను నిగ్రహించెను. తన సంపదను సాధులకు బంచియిడెను, అధీరునివలె కామసుఖంబుల నాసక్తుఁడుగాక వనితల యనుచితానురాగమునుండి విముఖుడై ధైర్యముచేత చంచలములైన యింద్రియాశ్వములను గుణములచే బంధువులను పౌరులను జయించె. అతఁడు పరుల దుఃఖపెట్టుటకై విద్య నేర్వలేదు. శుభమైన జ్ఞానమును తెలిసికొనెను. తనసంతతికివలె సర్వప్రజలకు శుభముఁగోరెను. తన కుమారుని దీర్ఘాయువునకు యథావిధిగా బృహస్పతిని అర్చించెను. అగ్నియందు హోమములు చేసెను ద్విజులకు గోవులను దానముచేసెను. తీర్థజలముచే శరీరమును గుణజలముచే మనస్సును పవిత్రపఱచి వేదోపదిష్టమైన సోమరసమును ఆత్మోపదిష్టమైన శాంతిని పానముచేసెను సార్థకమైనదానినే పలి

కెను వ్యర్థముగా మాటాడలేదు తత్త్వముసేగాని అప్రియముగా మాటాడలేదు. సత్యమునేగాని అప్రియము పలుకఁడు. ప్రియమైన యసత్యమును సిగ్గుచే తనకోసముకూడా పలుకలేదు. ఇష్టములందనురాగమును అనిష్టములందు ద్వేషమును చూపలేదు. శుభ వ్యవహారములలో శుద్ధమైనదానినే శుభ్రముగా భావించెను సత్యము వింతగా భావించెనోఅంతగా యజ్ఞమును తలఁపలేదు. ఆశతో వచ్చినవాని తృష్ణను దానజలములతో ఛేదించెను. యుద్ధము చేయకుండనే సదాచార కుఠారముతో శత్రుగర్వవృక్షమును కొట్టివైచెను ఒకటి (తన్ను) వంచెను ఏడిటిని (రాజ్య సప్తాంగముల గాచెను) ఏడిటినే (సప్తవ్యసనములను) విడిచెను అయిదింటిని (ఉపాయములను) రక్షించెను. త్రివర్గమును (ధర్మార్థ కామములను) పొందెను మూఁడిటిని (శత్రుమిత్ర తటస్థులను) తెలిసికొనెను ద్వివర్గమును (నీతిఅనీతి) ఎఱిఁగెను రెండిటిని (కామక్రోధములను) విడిచెను అపరాధులు వధ్యులైనను దండించలేదు కసితోఁ జూడఁడు ప్రియముతో వారినిగూర్చి స్వల్పముగా శిక్షించెను. వారిని విడుచుట కూడ అనీతియే యనియెంచెను ఆర్ష వ్రతములను ఆచరించెను చిరవైరములను విసర్జించెను గుణ గంధములఁజిమ్ము కీర్తుల నార్జించెను మలినపఱచు రజస్సులను విడిచెను అనుచితములగు వస్తువులను ప్రజలను డిగ్గి కొనలేదు పరవస్తువులందుఁ గాంక్ష యుంచలేదు. శత్రువుల యధర్మము ప్రకటింపఁగోరఁడు హృదయమునఁ గోపము పూనలేదు. యోగారూఢుఁడైన వానిని వాని యింద్రియములవలె ఆ భూపతిని వాని భృత్యులును పౌరులను "యధారాజా తధాప్రజా" అను న్యాయమునుబట్టి అనుసరించిరి.

* ఇంక రాకొమరుఁడు కోర్కెలెనయుచుండ
వర పయోధరయును యశోధరయునైన
యా యశోధరయందు సిద్ధార్థుఁడు కనె
రాహు రిపుచంద్రముఖు రాహులాఖ్యసుతుని॥ 21

---

* సిద్ధార్థకుఁడు ముసలిరోగి మృతులను జూచినపిదప తపస్సునకు పోవుటకుకొంచెము ముందుగా అతనికి రాహులుడు పుట్టినట్లు బౌద్ధ గ్రంధములందున్నది. అశ్వఘోషుడు ముందె పుట్టినట్లు రచించెను

శుభపుత్రుండయి ప్రీత చిత్తుఁడగు నా శుద్ధోధనుండన్వాయం
బభివృద్ధింగన నెట్లు పుత్రజననం బందున్ ప్రమోదించె నీ
శుభ పౌత్రున్‌గని నప్డుగూడ నటులే శోభిల్లిలోనన్ సుఖా
ను భవంబొందుచుఁ బొంగిపోయి కడు ధన్యుంగాఁ దలంచెన్ దనున్॥

"చెలఁగి సుతుమీఁద నాకెటుల్ స్నేహమొదవె
నటులె సుతునికి నెంత స్నేహంబు నొదవు
నోకొ" యని పొంగి స్వర్గంబు నెక్కఁగోరు
క్షితిపుఁడా యాయి కర్మల చేయఁదొడఁగె॥ 23

కృతయుగంబునందలి రాజ వృషభులెట్లు
యశమె కాంక్షించి నకచిరో యటులె రాజు
శుక్ల వసనాల్ విడకె తపస్సులను జేసె
స్వల్ప హింసయు లేని యజ్ఞాలు చేసె॥ 24

క్షితిపు శ్రీచేత తపసు శ్రీచేతఁ బుణ్యుఁ
డయిన నృపతి మెఱని యన్వయంబుచేత
బుద్ధిచేఁ నడతచేత శుద్ధమైన
వర్చసొప్ప సహస్రాంశువలె వెలి గె॥ 25

సుతుఁడున్ వర్ధిలగా స్వయంభువుని గొల్చున్ జపించున్, సదా
వ్రతముల్ చేయు, సృజించు బ్రహ్మవలె నశ్రాంతంబు చేయంగ లే
నితపంబుల్ పొసరి చె, శస్త్రములనేనిన్ వీడె శాస్త్రంబులన్
మతి శోధించె శమంబు పొందె నియతిం బాలించె నెల్లప్పుడున్॥ 26

వశిపోలెన్ విషయాలవైపు చనఁడా ప్రాంతాలు దేశంబులన్
భృశమున్ జూచెను తండ్రిపోలె సుతకై స్వీయంపు సామ్రాజ్యమున్
వశమందుంచియ యేలు, వంశమునకై పాటించెఁ బుత్రున్ సదా
యశమున్ గాంచుఁ గులంబొడల్ దివికె ధర్మార్థంబు నాత్మన్ గనెన్॥

అతఁడిటు వివిధ ధర్మంబు లాచరించి
పెద్ద లాచరించెడి శ్రుతి సిద్ధమైన

వ్రతములను జేయు, నెటులైన సుతుఁడు వనికి
చనకయుండుఁ గాకయని ప్రార్థనలు చేయు॥ 28

తమదు లక్ష్మిని రక్షింపఁ దలచు నృపులు
ఎపుడు పుత్రుల రక్షింప నెంచు చుంద్రు
ధర్మకాముఁడైయైన యీ ధరణీ పతియె
ధర్మములు త్రోసి, విషయాలఁ దనయునుంచె॥ 29

సాటిలేని సత్త్వాలు బోధి సత్త్వాలైతె
ఆత్మజులఁగని విషయంబు లనుభవించి
వనులఁజనిరి, మూలము గట్టిదైన నతఁడు
బోధి కలుగుదాఁక విషయంబుల భజించె॥ 30

ఇది

ఏడవ యాశ్వాసము



# బుద్ధ భగవానుని చరిత్ర

# ఎనిమిదవ యాశ్వాసము

## సిదార్థుఁడు పురము చూడఁబోవుట

ఇటులుండ నొకప్పుడారాకొమరుఁ డాపురివెలుపల

మెత్తని పచ్చిక బయళుల
మత్తిలు మగకోయిల ధ్వని మార్మ్రోగు తరుల్
హత్తిన తమ్మి కొలనుల జ
గత్తుల గీతాల వసలు గలవని వినియెన్॥ 1

వనితల కింపగు పురి యుప
వనముల రమణీయ దృశ్యా భరదేశములన్
విని, యుంటఁ గట్టిన గజ మ
యిన యతఁడు వెలి వనముల కేగందలఁచెన్॥ 2

తన కోర్కెల ముద్దయయిన
తనయుని భావంబును విని ధరణీపతి యా
తన ప్రేమకు సిరికి వయసు
కనువైన విహారయాత్ర కాజ్ఞాపించెన్॥ 3

మరలింపించెను రాజమార్గముల నేమాత్రంబు నార్తుల్ చనన్
తిరుగన్ మాన్పెను నింద్రియాంగనికలున్ వృద్ధున్ వ్యథార్తున్ పథిన్
అరయన్ జాపెను శాంతితోఁ గృపణు దైన్యాగ్రస్తు రోగిన్ పురిన్
కరమున్ శ్రద్ధగ రాజవీధులను సింగారింపఁ జేసెన్ మదిన్॥ 4

సిరిశోభల్ వెదఁ జల్లు రాజపథిలో శ్రీమంతుఁడాతండు త
త్పురి యుద్యానవనుల్ గనుంగొన వినీతుల్ సేవకుల్తోడ గ్ర

మ్మరఁ బ్రాసాద తలంబునుండి దిగి సమ్మాన్యాత్ముఁడౌ తండ్రి ముం
దరికేతెంచి యనుజ్ఞ పొంద నిలిచెన్ నమ్రోత్తమాంగంబుతో॥ 5

వచ్చినసుతుఁగని, వెలికిన్
వచ్చెడు కనీళ్ళతోడ న్వసుతు శిరస్సున్
హెచ్చిన ప్రేమను మూర్కొని
యిచ్చె ననుజ్ఞనుడిఁ; బ్రేమనివ్వఁడు మదితో॥ 6

అతఁడంతన్ జిలుపైఁడి కుంభములు శీర్షాగ్రంబులం బొల్చును
న్నతమౌ నాల్గు హయాలు పూన్చిన హిరణ్యంపున్ రథంబెక్కి స్నే
హితుఁడై యుత్తముఁడైన సారథియు నేర్పొప్పఁ దోలన్ సతీ
యుతుఁడై ఖాసిలి పైలుదేఱె నగరం బొప్పార వీక్షించుచున్॥ 7

విచ్చినపూలుజల్లి నలువీధులఁ దోరణముల్ రచించి పై
కెచ్చి చలించు పల్ ధ్వజములెల్లెడఁ బిల్చుచునుండ, యోగ్యమౌ
నెచ్చెలికాండ్రు తోడఁ జన, నింగిని చుక్కలతో వెలుంగుచున్
వచ్చిన చందురుంబలెను వచ్చెను నాథుఁడు రాజవీధికిన్॥ 8

వేడుక హెచ్చఁ గన్నులను విప్పియుఁ జేటల యంతవేయుచున్
గూడియు నీలికల్వలను నున్నగఁ గప్పిరొ యేమొ యన్నటుల్
చూడికికిన్ మనోహరత చొప్పడ నొప్పిన రాజవీధి న
ల్లాడుచు చేరి పౌరులు నృపాత్మజుఁ గాంచిరి ప్రోగులై కడున్॥ 9

కొందఱు సౌమ్యతఁ బొగడిరి
కొందఱతని ద్యుతికి మ్రొక్కి కొలిచిరి వినతిన్
కొందఱతని శ్రీ మెచ్చిరి
యెందఱొ దీర్ఘాయు వొందనిడి రాశీస్సుల్॥ 10

పండు కుటీరమునుండియు
మెండగు భవనాలనుండి మేకొని జనముల్
తండోప తండములుగా
దండిగ మొక్కి రటువచ్చు దైవాని కటుల్॥ 11

మన యువరాజిటు వచ్చెడు
నని భటులన విని ప్రమదలు హర్మ్యా తలంబుల్
పనివడిని నెక్కిచూచిరి
మనసంతయుఁ గండ్లపైనె మసలించి కడున్॥ 12

మొలనూళ్ళు జాఱి పడినను
కలఁత నిదురనుండి లేవ కనువిడకున్నన్
తెలియుటఁ దదా గమనము
వెలఁదులు నగలూనక పరువెత్తిరి చూడన్॥ 13

వడి మేడమెట్లు దిగు తఱి
తడఁబడు నడుగుల దబదబ ధ్వానంబులకున్
నడుముం రశనల, యందెలఁ
బడుధ్వని గృహపక్ష గణము భయపడిపఱచెన్॥ 14

ఒకరినొకరు రాశికొనుచు నుఱుకుచుండి
యుత్సుకత భామినులు పోవుచున్నఁగాని
నడుము క్రింది పైభాగముల్ వడిగఁబోవ
నీక యవి యాపు బరువౌచు నెనఁగి యుంట॥ 15

శీఘ్రముగఁ బోవు శక్తితోఁ జెలఁగికూడ
ఒకతె నడకాపి పోవక యుండెఁ ద్వారగ
సిగ్గుచే రహస్యముగఁ దాల్చిన విభూష
లొకరికిని గానఁబడకుండ నుంచఁదలచి॥ 16

భూషలొండొండు రాసుక ప్రోగుపడియె
కుండలాల్ గండ్రగోశాన క్షోభ పడియె
తాల్చిన నగల గణగణ ధ్వానులతోడ
గొణిగి కిటికీలు శాంతిని గోలుపోయె॥ 1

కుండలా లొండొకటి రాసికొనుచు నుండ
వేగకిటికీల నుండియు వెలికివచ్చు

నంగనల మోము దామరలందమీను
సౌధముల వ్రేలఁ దీయు నబ్జములువోలె॥ 19

యువతులు కిటికీలఁదెఱచి
యువరాజుం జూచుచుండ నొప్పెఁ బురంబుల్
స్వ విమానములం దచ్చర
యువతులు నెక్కఁగఁ గనుగొను వ్యోమము వోలెన్॥ 20

పయినుండి క్రిందికిఁ బ్రమద ల
రయ వారిలకుఁ జనఁగోరు లాగునఁ దోచెన్
పయికిం గనుఁగొను పురుషులు
వియత్తలముఁ జేరఁగోరు విధమును దోఁచెన్॥ 20

సిరిచేత వయసువేతన్
గరముజ్జ్వలుఁడయి యతఁడు ప్రకాశింపఁగ నా
పుర వనితలు తలంచిరి యీ
తరుణుని సతి యెంత పుణ్యతరుణియొ యనుమన్॥ 21

ఆజాను పీనబాహుం
డీజన పతికొడుకు చూడ సాక్షాత్స్మరుఁడే
శ్రీఁజనఁ ద్యజించి ధర్మమె
తాఁ జేపట్టునని సతులు తలఁచిరి మేలున్॥ 22

ఈ పగిది నయము రుచిగల
యా పౌరులచేత నిండి యలరెడు పురమున్
వపుగఁ గని మెచ్చి తలఁచె
నా పుణ్యుఁడు క్రొత్త జన్మమందిన యటులన్॥ 23

## సిద్ధార్థుడు ముసలివానిని రోగిని మృతుని జూచుట

అప్పుడు హర్షభరితమౌ
నప్పురి శుద్ధాధివాసు లమరులు దివముం

జొప్పునఁ గని బోధకుఁగా
నప్పుడె సృష్టించి వృద్ధునంపిరి యతులన్॥ 24

ముసలితనము నిండిన ముదుక నరసి
ఇందఱవలె నీతండు లేడేమి యనుచు
కదలికేలేని దృష్టితోఁ గాంచి యప్పుడు
సారథిని బిల్చి యడిగెను క్ష్మాప సుతుఁడు॥ 25

నరుఁడితం డెవనండో సూత! నెఱసెజుట్టు
కఱ్ఱచేఁ దాల్చెఁ గన్బొమల్ కనులఁ గప్పె
ఒడిలిపోయిన యొడలితోనుండె నిద్ది
వీని ప్రకృతియా లేకెట్లు వికృతిగలిగె॥ 26

అని యతులు రాజతనయుండు నడుగ సూతు
డిందులో దోష మేమున్నదింక ననుచు
దేవతలచే నతనిబుద్ధి దీప్తి చెడగ
నిట్టులనె దాచవలసిన దిద్దియయ్యు॥ 27

"హంతకి రూపసంపదకు నార్తి బలంబుల కెల్లవానికిన్
హంతకి సర్వ హర్షముల కాది సమస్తపు దుఃఖపంక్తికిన్
హంతకి సర్వ సంస్మృతికి హంతకి నింద్రియ నాజిరాజికిన్
నెంతని చెప్పవాఁడ జర యియ్యది యీతఁడు చిక్కె దీనికిన్॥ 28

బాల్యమున నితఁడును పాలు ద్రావినవాఁడె
బాలుఁడైన నాఁడు నేలఁ బ్రాకె
వరుస యువకుఁడౌచుఁ బ్రాయమొందిన వాఁడే
పొంచి వీని మ్రింగె ముసలితనము॥ 29

ఇట్లు ఆ సారథి చెప్పఁగా విని మతి చలింప రాకుమారుఁడిట్లు పలికె "అయితే నాకును ఈ వికార దోషము గలుగునె" అని పలుకుటయు నపుడు సూతుఁ డిట్లనియె "ఓ రాజతనయా! నిస్సందేహముగా ఇట్టి వృద్ధావస్థ నీకును కాలవశముచేఁ గలుగును. రూపమును నశింపఁజేయు ఈ జరనందఱును

ఎఱుఁగుదురు. లోకము దీనిని పొందుచునే యుండును అని." అపుడా మహాత్ముఁడైన కుమారుండు పూర్వాలోచనలచే శుద్ధమైన బుద్ధిగలిగి అనేక కల్పములనుండి ప్రోగుపడిన పుణ్యకర్మలు కలవాఁడై ముసలితనము సంగతి విని దగ్గఱగా గొప్ప పిడుగు పడఁగా హడలిపోయిన గోవువలె సంవిగ్న స్థితిని పొందెను అంత దీర్ఘముగా నిట్టూర్చి తన తలకంపించిపోవ ఆ వృద్ధునివైపు నేత్రములుంచి, అట్లే సంతోషముతో కులుకు జనులనుగూడ నిరీక్షించి సంవిగ్నుఁడై యాతఁ డిట్టులనియె ఇట్లు ముసలితనమువచ్చి వీఁడుబీద, వీఁడు రాజు అను భేదము లేకుండ స్మృతిని రూపమును పరాక్రమమును జంపుచున్నదే ఇంకను లోకము స వేగమును పొందదేమి ప్రత్యక్షముగా నిట్టిది చూచుచుఁ గూడ నిట్లున్నదె సరె కానిమ్ము సూతః గుఱ్ఱములను ఇంటికి మరలింపుము. ఈ పూవుదోటలో జరాభయముచే నా మనస్సు దుఃఖించుచుండ నా కింకెక్కడి యానందము" అని రాకొమరుఁడనఁగా విని ఆ రథసారథి రథము నింటివైపు మరలించెను. ఆ సిద్ధార్థుఁడు అపుడు చింతావశుఁడయి తన భవనమును శూన్యమునువలెఁ బ్రవేశించెను.

ఎపుడయితే నృపాత్మజుఁడు నింటికి విస్మృతి చెందనెంచెనో
అపు డదిగో జరా భుజగి యల్లదిగో జర మ్రింగవచ్చె నిం
కిపుడెటు పోదు" నంచు నటనేనియు శాంతిని పొందలేదు తా
నపుడు మఱిన్ మఱిన్ జనకు నాజ్ఞను పొందె చనెన్ వనాళికిన్॥ 30

అవల దేవత లొక రోగియైన నరుని
సృజనచేసి రాకొమరు వీక్షింపఁజేయ
నపుడు సిద్ధార్థుఁ డవ్వాని నరసి మరల
సూతుఁ బల్కె నతని వైపె చూచుచుండి॥ 31

"లావయిన పొట్ట, రోజుచు శ్రమను వణఁకు
నొడలుగల్గి యంసములు బాహువులు వ్రేల
చిక్కి పాండు రోగంబుచే స్రుక్కి 'అమ్మ'
అనుచు నొకనిఁ బట్టుకొను నీ మనుజుఁ డెవఁడు॥ 32

అపుడు సారథి యనె సౌమ్యః యతని మేన
ధాతువులు ప్రకోపింప వృద్ధంబయైన

వ్యాధిచే నీ మహానర్థ మయ్యె నింక
శక్తుఁడయ్యును దీన నశక్తుఁడయ్యె॥ 33

అనఁగ సిద్ధార్థుఁడనె బాలి నతనిఁ జూచి
ఇట్టి దోషం బతనికయ్యెనే మఱింక
నందఱకుఁ గూడ నగు నొక్కొ యనుచు నడుగ
నంత నా సూతుఁడనియెను నతనితోడ॥ 34

ఆ సూతుఁడు "కుమారా దోషము సామాన్యమైనదే ఇట్లే లోకము రోగముచే బాధింపబడును మఱి సంతోషమును పొందదు" అని. ఇది విని రాకొమరుఁడు నీటిలోఁ గెరటములచేఁ జలించు చంద్రునివలె వణఁకుచు దీనముగా మెల్లని స్వరముతో నిట్లనెను. అహో మనుష్యుల యజ్ఞాన మెంత టిదో రోగభయముచే బాధపడుచునున్నను నమ్మకముతో లోకములోనున్న యీ రోగముచే ముక్తులుకాక కూడ నవ్వుచున్నారే" సూత మన రథము ఇంటివైపు మరలించుము రోగభయము వినఁగా నా మనస్సు సంకోచపడుచున్నట్లున్నది. అనఁగా నా సారథి రథమును మరల నింటికి మరలించెను.

ఇటు కుమారుఁడు రెండుసార్లేగి తిరిగి
వచ్చుటనుజూచి రాజిట్లు వచ్చెనేమి
యని విచారించి యుద్దిశౌచాధికారి
లోటని యలిగె, వేయఁడు క్రూరశిక్ష॥ 35

కాంచి మఱి సుతు నధిక భోగములనుంచి
యింద్రియంబులు చలమౌట నితండు మనల
నెన్నఁడును వీడఁబోఁడని యెంచి లోన
నృపతియెక్కువ దుఃఖింపఁ డిందుకొఱకు॥ 36

ప్పుడైతె కుమారుఁడు మది యింద్రియముల
ంతిపురమున నానంద మందలేదొ
యపుడు రుచి మార్పు చేయ మేలగు నటంచు
నటు రసాంతరమౌ యాత్ర కనుమతించె॥ 37

స్నేహమునఁ బుత్రభావమున్ దెలిసి రాజు
రాగబాష్పంబులెడ విచారంబుమాని
కళలలో జాణలౌచు యోగ్యలుగ నున్న
వారకాంతల నటునుండఁ బనుపు చేసె॥ 38

బహు విశేషంబుగా రాచబాటలెల్ల
కడుఁ బరీక్షించి వడి నలంకారములను
గూర్చి సూతునిన్ రథమును గొత్తవానిఁ
జేసి కొమరుండు వనులేగఁ జెప్పిపంపె॥ 3

అపుడటుల రాజపుత్రుఁడు నరుగుమంద
దేవతలు గూర్చిన శవంబు దీసికొనుచు
కొందఱటు మోసికొని పోవఁ గొమరుఁడింక
సూతుఁడును జూచిరిఁకెవరుఁ జూడలేదు॥ 40

అంత రాజసుతుఁ డడిగె "నాతఁ డెవరు
నల్గురటు మోసికొని పోయినా రదేల
వానివెంబడి దీనులై దేనికొఱకు
ఏడ్చుచుం బోయెదరంద ఱలంకరించి గూడ॥ 41

అవల శుద్ధాత్ములైన శుద్ధాధి వాసు
లైన దేవులచే బుద్ధియణఁచఁబడఁగ
చెప్పరాని దైనను దీని చెప్పె సూతు
డర్థ యుక్తముగా మఱి సిద్ధార్థునికిని॥ 42

బుద్ధి యింద్రియ బులు ప్రాణములును పోవ
గాఢ నిద్రచెంది స్మృతియును గడకులేక
తృణము కాష్ఠము వలె నౌచుఁ బ్రియ జనంబు
ఎంతగా పెంచి ప్రోచిన నిట్టెపోవు॥ 43

అనుచు సూతుఁడు చెప్పిన నాలకించి
మనసు క్షోభింప నాతఁ డిట్లనియె నపుడు

ఏమి యిది వీనికొకనికె యిట్లు గలిగె
గాక సర్వజనులకిట్లె గలుగు నొక్కొ॥ 44

అనఁగ సూతుఁడనెను సిద్ధార్థుతోడ
జగతి నందఱకును గూడ సంభవించు
హీనునికిఁగాని నడిమియౌ వానికైన
నెంతటి మహాత్మునికి తప్పదిటులు చావు॥ 45

అంత నాతఁడు ధీరుఁడె యైనఁగాని
చావుమాట విన్నంత విషాదమొందె
అంసము రథంపు నొగలకు నానుకొనుచు
ఆనియె గంభీరమౌ స్వరంబును ధరించి 46

నిష్ఠయిది యెల్లప్రజలకు నియతమైన
లోకము భయంబు విడి శ్రద్ధలేక యుండి
జనుల మనసెంత కఠినమ్మొ యని తలంతు
* చెంత చావుంచికొని యెంత నిశ్చింత నుంద్రు॥ 47

కనుక సూత! రథంబును వెనుక త్రిప్పు
ఇది విహారమునకు కాల మదనుగాదు
చావు గలుగునని యెఱిగి సమయమందు
మనసు గలవాఁ డెవండు ప్రమాద మొందు॥ 48

ఇట్లు పలుకుచున్నను సూతుడింక వినక
రథము నింటికి త్రిప్పక రమ్యమైన
బహు విశేషములును గల్గి పద్మ సరసు
లొప్పు వనము వైపునకునె త్రిప్పె రథము॥ 49

పరువై విచ్చిన పూల చిన్ని తరువుల్ పొల్పార సంపూర్ణమై
పరువుల్ తీసెడి మత్త కోకిలల శ్రావ్యంబైన గానాలు, తా

* చావు ముందుంచుకొని నిశ్చలత నుంద్రు

మర పువ్వుల్ గల యందమైన దిగుడుం బావుల్ విరాజిల్లు నా
విరిదోటన్ గనె నందనోపవనమే విచ్చేసి నట్లుండఁగన్॥ 50

సుందరాంగుల నూత్నలీలల సుందరంబగు నా వనిన్
మందమైన మనస్సు వెన్కకు మర్లుచుండఁగ నాతఁడున్;
అందమొల్కెడి యచ్చరల్ గల యందమౌ నలకా పురిన్
కొందలం పడుమాని పోలిక కొంకు వేగె బలాత్కృతిన్॥ 51

ఇది
ఎనిమిదవ యాఖ్యానము



# బుద్ధ భగవానుని చరిత్ర

## తొమ్మిదవ యాశ్వాసము

### ఉదాయి కాంతలకు సిద్ధార్థునిమనస్సునుహరింపబోధించుట

అ త.

ఎదురేగి చపలాక్షు లితనికి స్వాగతాల్
　　విరిఁదోటనిచ్చిరి వరుని కట్లు
ము-దుండి తావ మొగ్గఁ బోలు చేతుల నభి
　　నందించి రుత్ఫుల్ల నయన లతివ
లతని చుట్టును జేరి యతను తప్తలు కాంత
　　లచల చక్షులఁ ద్రాగిరతని రూపు
చారు భూషలఁ బోలు సహజగుణాలున్న
　　యతని నెంచిరి మూర్తి నందున్మరుఁగ

సౌమ్యమును ధైర్యమును జూచి చానలితని
క్షమకు సాక్షాత్తు గుప్తాంశు చంద్రుఁడనిరి
కొంద ఱావులించిరి నిట్టూర్చి కొందరరసి;
రతని మహిమచేఁ బల్కరు ననరు నగరు॥ 1

ఇటుల నిశ్చేష్టలై చేయ కెదియు నిల్చి
ప్రేమ విహరలైనట్టి కామినులను
కని పురోహిత సుతుఁడు ధీఘనుఁ డుదాయి
యనియె నేర్పుతోఁ బ్రమదల నరసి యపుడు॥ 2

సకల కళా ప్రవీణలరు సర్వ మనోగ్రహణాతిపండితల్
సకల సురూప సంపదల జాణ లిటున్ గుణ ముఖ్య శోభితల్

భ్రుకుటి గుణాల, నుత్తరకురుక్షితులేనియు శోభగూర్తురే
యుఁకను గుబేరు పుష్పవని నీ ధరనెల్ల నలంకరింతురే 3

మీరలు చేయలేని దెది మేదిని, మౌనుల వీతరాగులన్
ధీరులఁ గంపమొందునటు నేర్పునఁ జేయగలారు; యప్సరల్
వేరఁగఁదీయు దేవతల చిత్తము సైతము నుత్తలంపడన్
గూరిమిఁ బట్టఁగాఁ గలరు కోవిదలౌదురు సర్వవిద్యలన్ 4

భావముల జ్ఞానములచేత హావములను
రూపచాతుర్య సంపద చూపిమిగుల
స్త్రీలనే వశపఱచుకోఁ జాలుశక్తి
వెంతఁగలదు నరులమాట చెప్పుటేల 5

అట్టిమీరలు మీ విషయంబులోనె
వడిగనిట్టివారైనఁ జెప్పెడిదియేమి
మీ స్వభావమునొప్పము మేము; నిదియె
ముగ్ధనవవధులకు గొల్ల బోంట్ల కొప్పు 6

ఇతఁడు ధీరుండు శ్రీమంతుఁడేని యవుతఁ
గడు ప్రభావశాలియు మహాత్ముఁడును నౌతఁ
గాని స్త్రీలకు నింతటి కంటెనధిక
శక్తిగలదుగా ఇంక నిశ్చయము గొనుఁడు 7

మును కాశి సుందరి యనువేశ్య, సురలకు
దుర్ధర్షుఁడౌవ్యాసుఁ ద్రోచెఁగాల
జంఘుయన్ వేశ్యకోసమ్ము మంథాల గౌ
తముఁడమ్మి శవముల ధనము గొనియె
దీర్ఘ జీవనమొంది దీర్ఘతపసుచేత
గౌతమఋషి నీచకాంతఁ బొందె
స్త్రీలనే యెఱుఁగని ఋశ్యశృంగమహర్షి
కాంతనె గని పెండ్లి సౌఖ్యమొందె

ఇంక మౌని విశ్వామిత్ర ఋషి ఘృతాచిఁ
గలిసి పదియేండ్లునొకరోజుగాఁ దలంచె
ఇట్లె యాయాయి ఋషులను నిట్టిస్త్రీలె
ప్రేమ ముంచి రేయుపవలుండ్రో యేమిలెక్క 8

కనుక మీరు స్వేచ్ఛగ యత్నమును బొనర్చి
డిట్టినృప వంశలక్ష్మి యింకెట్లుపోవ
కుండుత, మెవరేని తగుయువకుని హరింత్రు
స్వల్పునో పెద్దనో హరించు వారె స్త్రీలు. 9

## స్త్రీలు సిద్ధార్థుని మోహపరచ యత్నించుట

అని పలుకుచున్న యాయుదాయి వాక్యములు విని బాణములచేఁ గొట్టబడిన వారువలెనయి ప్రమదలు ఆ రాకొమరుని నెట్లయిన వశపఱచు కొనఁ గోరి పట్టుదల వహించియుండిరి. ఆప్రమదలు తమ భ్రూవిలాసలు పఱపి హావభావములుచూపి కోఁ గన్నులుచిమ్మి, చిఱునవ్వు వెన్నెలలు కురిపించి ఒయ్యారపు నడకలు నడచి భీతభీతలువలె కన్నులతనిపై జిమ్మిరి రాజునానతిచే నా రాకుమారుని మెత్తదనముచేతను మదమునకు మదనునికిని వశలయి శీఘ్రముగాఁ దమయందలి యవిశ్వాసమును విడిచిరి మఱియు నతఁడు కామినీ జనములావరింప ఆడ యేనుంగులచేఁ జుట్టుకొనఁబడిన యేనుగువలె ఆ హిమాద్రి వనమున సంచరించెను. అందఱు స్త్రీలయందు వైభ్రాజోద్యానమున నప్సరసలతో నింద్రుఁడువలె రాజిల్లెను మరియు నొడలు మఱచిన భామినులు తమతమ్ముదు మధురమైన వతినావయువముఁ చేనొత్తి గ్రుచ్చి కవుంగలించుకొనిరి

సుంత వంగిన మెత్తని సోలుకేలుఁ
దీవయులదు నజల యొకత్తెయుఁ దటాల్న
పడుచునున్నటు లెదొయొకనంక పెట్టి
నృపతనయుఁ గట్టిగఁ గౌఁగలించుకొనియె 10

# స్త్రీలు సిద్ధార్థుని మోహపఱచ యత్నించుట 

రాగివలె నెఱ్ఱనౌ నధరంబు గలిగి
స్వాదు సీధు గంధము వెదఁజల్లు మోము
దగ్గఱగఁ జేర్చి చెవిలోన దయితయిదిగొ
ఈఁడ హాస్యము వినుమని యుట్టియూదె. 11

గొందపుంబూఁత తడియాఱకయె దలిర్ప
నిచట మకరికా పత్రాల్ రచింపుమంచు
కేలు స్పృశియుచు కోర్కెతోఁ గేలు చాపి
యాజ యుడుచున్నయది వోలెననియె నొకతె. 12

మత్తు చేమాటిమాటికి మనలిసోలు
వంక పెట్టి నీలపు జరీవలువ జార్చి
రశన కొంచెము కన్పింప రమణియొకతె
మెఱయు మెఱపుదీవియ రాత్రి కరణి మెఱసె 13

పైఁడిమువ్వల మొలనూళ్ల ధ్వనులుగుమ్మ
వలిపపుంబట్టు వలువయుఁ బయినిగప్ప
శ్రోణులను జూపుచును పువుఁబోణులంతఁ
గొంద బొయ్యార మొలకించి విందులిడిరి. 14

విరియఁబూచిన మామిడి విరులరెమ్మ
పట్టుకొని స్వర్గకలశాల వంటి నిండు
నవయవంబులఁ జూపుచు మివుల కొంద
అధిపతనయు నాకర్షింప నటఁజరింత్రు 15

నిండుదామర కొలనులనుండి వచ్చి
చేతఁదామరపువ్వు భాసిల్లఁ దాల్చి
పద్మలోచన యొకర్తె పద్మవదనుఁ
డౌనితనిఁజేరె పద్మంపు శ్రీనిబోలి 16

మధురమై యర్థయుక్తమై మృదుపదాఢ్య
మైన యొకగీత మభినయాంచితముగ

నొకతె పాడెఁ గటాక్షంబులకును దూర
మైతివని స్వప్నతని దూఱాడునటుల 17

ఒకతె కనుబొమ్మ స్మరుధను సొన్కటివడిగ
చిమ్మి శుభవక్త్రరుచితోడఁ జేరి వెనుక
దిరిగి ధీరలీలల చేత ధీరునతని
నందమగు చేష్టితంబుల ననుకరించె 18

బలిసి గుండ్రమైన యవయవాలు గుమ్మ
విఱుగఁ బడినవ్వఁ గుండలాల్ తిరుచుండ
నీవుపూర్తిచేయుమి దీనినింకనను చు
నింక గట్టిగ నవ్వ వర్షించెనొకతె 19

తప్పుకొనిపోవు నాతనిన్ దరుణులన్యో
లలరు దండల పాశాల నిలిపి కట్టి
రింక కొంద ఱాక్షేపించి మృదువులైన
మధుర వచనాంకుశములంబఱపి రతిగ 20

ప్రణయ కలహాలు కల్పించి ప్రమద యొకతె
మావిపూతల గుత్తిని మడచిపట్టి
పుష్పమిది యేరిదని పోయియడిగి
మత్తుచేత విహ్వాలయౌచు మసలితిరిగె 21

ఒకతె పురుషునివలె లేవి యొలుక నడిచి
అకృతిని గూడ సరిగానె యనుకరించి
ఆడవాళ్ళకు లోఁబడి యోడిపోతి
భూతలినెట్లు గెలుతువో చూతమనియె 22

ఫుల్లలోలేక్షణ యొకర్తు నల్లఁగలువ
ముక్కుదరిహత్తుకొని తావి మూర్కొనుచును
మత్తుచే మధురముగ మాటలనుచును
పార్థివాత్మజు నూరకె పలుకరించె 23

ప్రభువ! యిటుచూడు మధుగంధవాసియైన
పూతతోచెట్లు మామిడి మురువులొలుకు
అందె బంగరు పంజరమందు బద్ధ
మైన యటులు కోయిల తెగనార్చుచుండె. 24

అదె యశోకముచూడు కామాంధులకును
శోకమును వృద్ధిచేయుచుఁ జొప్పు మీఱు
వహ్నిలోఁబడ దహియింపఁబడినయట్లు
భ్రమరము లవె జుమ్మన చేయుభ్రమణములను 25

మావిరెమ్మచేఁ గవుఁగిటం బట్టబడిన
తిలకవృక్ష మిదేచూడు మలరెనెటులు
పసుపు మైఁబూఁత యలరారు భామకేగి
విడిన తెల్లబట్టగల నరుఁడొ యనంగ॥ 26

ముద్ద చేసిలత్తుకఁ బోలునిచటి
ముద్దగోరింట పువ్వును పొంచిచూడు
స్త్రీల చిరుగోళ్ళచే బెదరింపఁబడిన
వాఁడు వోలెను నెంతగా వంగియుండె॥ 27

చివురులు నిండిన చిరు నశోకముచూడు
మనకేలుద్యూతి సిగ్గుగనుచు నుండె
తటిసిందువారాల దనరు దీర్ఘికచూడు
తెల్లబట్టఁ బరుండు స్త్రీని బోలె
స్త్రీల మాహాత్మ్య మీక్షింపు మీచక్ర
వాకము భటునట్లు పడతిఁజేరు
మత్తిల్లు కోయిల మధురధ్వాని వినుము
మఱొక కోయిల ధ్వానిం బ్రతిగఁగూసె॥

ఏమియీవసంతము పక్షిబృందములకు
మదము రప్పింపఁ గలుగును మదికిగాని

జ్ఞానినసుకొనుచు నచింత్యమైన దాని
నెంచు నరునకు మదమును నీయఁగలదె॥ 28

ఇటులా యువతులు మన్మథునిచే విశృంఖలముగా నుద్దీపఁజేయఁ
బడినచిత్తముగలవారై ఆ రాజకుమారు వివిధోపాయములచే ఆకర్షింపనుప
క్రమించిరి. అంత నారాజకుమారుండు మరల

అతఁడా ఖండలు నందనంబటులు రమ్యంబై, వికచ్ఛాత్రసం
తతి విద్యాగృహమై, యనంగునికి నూత్నంబైన తూణీరమై
నకతోజ్జృంభిత షట్పదాంగనల స్వేచ్ఛాసుద్యాగేహంబున
ద్భుతమైనట్టి వసంత లక్ష్మిగృహమౌ, తోఁటన్ జనెన్ గ్రమ్మరన్ 29

సకలచరాచరంబులకు సర్వవిధంబుల వందనీయుడై
ప్రకటితుఁడైన యాయతిథిరాకను గన్గొని మెల్లమెల్లగా
లికిఁదల వంచి కొంజివురులీలల దోసిలిపట్టి స్వాగతం
బకలుషరీతినాయువ వనాంచిత వృక్షములిచ్చెనంతటన్ 30

పుష్పాదుల తిన్నెలందముల్ పోనియున్న
పడినపూలు మరందాలఁ దడిసియున్న
రాలిన ప్రసూనములకాన్కలను దనరు
పూలదోఁట వీరుండు విహారాలు సలిపె॥ 31

లలితగాత్ర విక్షేపాలు నటులపాట
లలరు కోయిల కూతలు లలితరవము
లలరు చుండెడి యుద్యానముల షికార్లు
సరిగనది మారుసంగీత శాలఁబోలు 32

తరుల విరులను గోయఁగఁ దలచుచుండి
వంకరగు కురుల్ చెలువూరు వనితలంత
మందమందముగఁ జరించిశ్మాప సుతుని
కొలువుకై వచ్చెడి దేవతలయా చెలువు గాంత్రు 33

విరివని విహరించు హరిణ నేత్రలపాట
లాలకించి యల్లనల్లఁ దిరిగి
సిగ్గుపడుచున్న చెలువము లొప్పఁగ
నాగివసంత పికము లూఁకుండె 34

అందెల రవళివంకతో నిందునన్న
సుభ్రూ! బాధ పెట్టకుమని శోకమొంది
కోరుచున్నదివలెఁ బద్మ కోమలమగు
నంఘ్రి చేనశోకము నొత్తియల్లఁ దాకె॥ 35

తరుణీజనుల కాలి తాకిడిని సైచనిది పోలెనొక యశోకలత క్రొంజివురు ప్రసవముల వంకతో కోపాగ్నినివలె విడిచెను. సుధామరీచి ద్యుతిశీతలమైన పాణిసుఖస్పర్శచేత నొకతె పైకి పొడుచుకొనివచ్చుచున్న మొలకలుగల గగుర్పాటు గలమావిగున్నను పన్నగత్రమును పొందించెను. వెంటనే ఒకమామిడి గున్నమదనునికభిమాన కరములై పాంథ జనులకు బాధ కలిగించునవాంకురములను ప్రసవించెను ఒకతె సౌగంధి కేందీ వరములచేఁ బరిమళించు ప్రాతమాధ్వీక రసమును పుక్కిటఁబట్టియుమిసి పొగడను అశోకముగా జేసెను ఒక ప్రమద పూలు లతలతోఁ గుచ్చి విచి త్రమైన మొలనూలును జేసెను. నవమాలికను తీ సంపెగపూలను దెచ్చి కురులందు ముడిచి తనకేశపాశమును మదనుని యంబుల పొదిగానొకతె రచించెను. కొమ్మను బలిమితోవచ్చి పూవులు గోయుచున్న యొకతె కండ్లతోఁ గోపముతోవలె నశోక తరువు పుప్పొడి చల్లెను. నాచిపుడుఁ గేలుతో ఇది పోరాడఁ దలచుకొన్నదే చూడుమేమిచేయుదునోయని యొకతెలీలగా మామిడిపూతను ఖండఖండములుగజేసెను ఒకతె సిందూరమువంటి శేఫాలికల పుప్పొడితో సఖురాలి నుదుట తమాల పత్రము నంటించెను. ఒకతెకొమ్మ వంచి దయతో కొంజివురు కోసి ప్రియుని కంఠమందలి మణిహారమును దీసివైచి దానిచోటపెట్టెను ఒకతె ప్రియుని వెనిలో కమ్మనుంచి భుజలతికలచే బంధించి కంఠమును ముద్దిడెను ఒకతె తనయొదలినెల్ల పూఁతోనింపి మదనాయు. పుష్పాది దేవతల శోభను జూపెను స్తనపుఁ బూగుత్తులు పలువరుసచివృక్షానుదాల్చి తీవెలమధ్యానిలిచి ఏది తీవెయో ఏది తనువో తెలియుటకు వీలుగాని రీతిగనుండెను

ఇటు నృప సుతుండంతిపురంపు టింతులనుఁ
గలిసి తిరుగ నీతనిఁ జూడదలఁచిపోలె
వేలకొలఁది కరంబుల గ్రాలు రవియు
మింటి నడిమిభాగమెక్కి మెలఁగె నెలమి॥ 36

ఎండ వేడిమిఁ బుట్టునెండ మావులఁ జరింపఁ
గలిగె తాపము బావుగాలి వీచె
తాప బు నోర్వక తరుల క్రిందకుఁ జేరి
జలము బోదెలఁ ద్రాగ ఛాయ లేగె
విహరించి శ్రమలచే వెడలు చెమ్మట బిందు
ల సుకీర్త్యంకురాలట్లు వెలసె
ప్రమదల చిక్కుల చెమట బిందులు స్నాన
రీతిఁ బిల్చు తటాక దూతులయ్యె
పూపుఁ దోటలఁ దాపముల్ పోవన డు
ఊష్మలను రాజహంసలు నూనుచుండ
ఎబ్బకలువల తావిలో నీదు బ్రమరిఁ
గనుచు దిగుడు బావినిమునుగంగ దిగియె 37

పద్మనేత్రలచే లాగఁబడుమనతఁడు
లీల వారితో జలకేళిఁ దేలుచుండఁ
జూచి దిగుడు బావియుఁ గూడ వీచిపాణు
లితని వైపు చాపియె గౌగిలించు కొనియె॥ 38

సుందరాంగు లా దిగుడు బావిలోఁ బ్రవేశింపగా నది ఉద్వేలమైనది. జలాశ్రయములు స్త్రీలతో సంబంధముగ గలవిగాన నెందుకు వేలనతిక్రమింపవు భామినుల యవయముల దెబ్బలకు భయపడినవి వోలె ఆతరంగములు వణఁకుచు వారికి తుంపురుల మిషతో ముత్యాలసరాలను గానుకయిచ్చినవి అపుడు అంతః పురాంగనలతో వరుణుఁడువలె నతఁడు సరస్సులో పద్మలోచనలతో విహరించెను అపుడు వారు అన్యోన్యము జలములు చల్లుకొని స్త్రీలు కొందఱు అపరాధునింబోలెఁ గాంతుని చేతలనిడిన నీళ్ళతోఁ గొట్టిరి తరంగరంగమున భృంగములు గానముచేసె. సరోరుహము నృత్యము సలిపి

